

# శ్రీమదాంధ్ర భగవద్గీత

(సమూల, ఆంధ్ర పద్య, తాత్పర్య సహితము)

రెండవ భాగము 10 - 18 అధ్యాయములు


కృతికర్త

విద్వాన్ ఈ. వి. సుబ్రహ్మణ్యం

చెన్నై - 600 039



ప్రకాశకులు

ఓం శ్రీ ప్రేమసాయి పబ్లికేషన్స్

12, కైలాయ శెట్టి వీధి

ప్రాత చాకలిపేట, చెన్నై - 600 021

✆ 596 41 20

ప్రథమ ముద్రణ : మే 1999

1000 ప్రతులు

మూల్యము రూ : 75-00





## కృతజ్ఞత

తిరుమల-తిరుపతి దేవస్థానమువారు హిందూ ధర్మ ప్రచార పోషకంగా చేస్తున్న ఆర్థిక సహాయ పథకముక్రింద ఒసంగిన భూరి విరాళము ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడినది.

దేవస్థాన పాలక వర్గమునకును, కార్య నిర్వహణాధికారి
డాక్టర్ I. V. సుబ్బారావు, I.A.S., గారికిని
నా కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు,
గ్రంథకర్త

ముద్రణ :
శ్రీ లతా కంప్యూటర్స్, 12, కైలాయ శెట్టి వీధి, ప్రాత చాకలిపేట,
చెన్నై-600 021. © 5964120

# రెండవ భాగము
# 9 అధ్యాయములు

పేజి నెం.



శ్లో. ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥

(10-21)

ద్వాదశాదిత్యులలో 'విష్ణువు' అను పేరుగల ఆదిత్యుడను నేను. తేజస్సులలో అంశుమంతుడైన 'సూర్యుడ'ను నేను. వాయువులలో 'మరీచి' అను వాయువును నేను. అన్ని నక్షత్రములలోను 'చంద్రుడ'ను నేను.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం దశమోఽధ్యాయః

## విభూతి యోగము

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. భూయ ఏవ మహాబాహో ! శృణు మే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥** 1

*తే.గీ. ఓ మహాబాహు ! నే జెప్పుచున్న హితము*
*నెమ్మి మీఱఁగ వినుచున్న నీకు నింక*
*నెంతయున్ మేలు సేయంగ నెంచి యిపుడు*
*చెప్పఁ దలఁచితి వినుము సుశ్రేష్ఠ హితము.*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! నేను తెలియఁజేయు విషయములన్నియు నీవు శ్రద్ధగా వినుచున్న కారణమువలన నీకు మేలు చేయవలెనని మఱియొక శ్రేష్ఠమైన వాక్యమును జెప్పెదను వినుము.

**శ్లో. న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।**
**అహమాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥** 2

*తే.గీ. వర మహర్షులుఁ గాని యా సురలుఁ గాని*
*ఎఱుఁగలేరు నా ప్రభవ మదేల యనిన*
*అన్ని విధముల వారికే నాద్యుఁ డగుదు*
*రమ్యగుణతేజ ! శ్రీ పాండురాజపుత్ర !*

**తాత్పర్యము :-** బ్రహ్మాది దేవతలుగాని, మహర్షులుగాని నాయొక్క పుట్టుకను, గొప్పఁదనమును తెలిసికొనఁజాలరు. దేవతలకు, మహర్షులకు నేనే మూలకారణమై యున్నాను.

**శ్లో. యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।**
**అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3**

*తే.గీ. ఆదియును లేక జననంబు నరయలేక*
*ఎల్లయెడ నుండు లోకమహేశ్వరునిగ*
*ఎవఁ డెఱుంగునో నన్ను వాఁడీ జగమున*
*మోహరహితుండు పాపవిముక్తుఁ డగును.*

**తాత్పర్యము :-** ఎవడు నన్ను పుట్టుక లేనివానిగా, అనాదిరూపునిగ, సమస్తలోకములకు నియామకునిగ తెలిసికొనుచున్నాఁడో అతఁడు మానవులలో అజ్ఞానరహితుండై, సర్వపాపములనుండి ముక్తుడగుచున్నాడు.

**శ్లో. బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః ।**
**సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవ చ ॥ 4**

**అహింసా సమతా తుష్టి స్తపోదానం యశోఽయశః ।**
**భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథ గ్విధా ॥ 5**

*తే.గీ. బుద్ధియును జ్ఞానమును నసమ్మోహ మోర్పు*
*సత్యమున్ భవాభావముల్ శమముఁ దమము*
*భయము నభయము సుఖదుఃఖభావములును*
*తపము సంతుష్టి సమతయు దానగుణము*
*యశ మహింసయు నపయశ మనున వెల్ల*
*వసుధ నావలననె గల్గు వారి వారి*
*కర్మలకు ననుగుణ్యముగాఁ గిరీటి !*
*ధర్మజానుజ ! వర సుభద్రామనోజ్ఞ !*

**తాత్పర్యము :-** బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, సహనము, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టుక, నాశము, భయము, భయము లేకుండుట, అహింస, సమత్వము, సంతుష్టి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి - ఇటువంటి ప్రాణుల నానావిధ గుణములుఁ గూడ నావలననే కలుగుచున్నవి.

**శ్లో. మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ 6**

*తే.గీ. ఎవరివలన జనించెనో యీ ప్రజాళి*
*అట్టి సప్తర్షులును సనకాదులున్ను*
*మనువులును గూడ నావలననె జనించి*
*నా రటంచును దెలియు మో వీరపుత్ర !*

**తాత్పర్యము :-** లోకములో స్థావర జంగమరూపమైన సృష్టికంతటికిని సప్తమహర్షులు, నలుగురు మనువులు కారణమాత్రులై మొట్టమొదట నా సంకల్పము వలననే జన్మించిరి.

**శ్లో. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।**
**సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7**

*తే.గీ. నాదు యోగమ్ము మఱియును నా విభూతి*
*గరిమమును యథార్థంబుగా నెఱుగువాఁడు*
*నిశ్చలంబగు యోగమ్ము నిశ్చయముగఁ*
*బొందు నర్జున ! సందేహ మిందు లేదు.*

**తాత్పర్యము :-** నాయొక్క విభూతిని (సంపదను), యోగమును, ఎవ్వఁడు యథార్థముగా తెలిసికొనుచున్నాఁడో అతఁడు నిశ్చలమైన యోగముతోఁ గూడుకొనుచున్నాఁడు. ఈ విషయములో సందేహము లేదు.

**శ్లో. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।**
**ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥ 8**

*తే.గీ. ఈ జగత్సృష్టి కంతకు నేనె హేతు*
*వీ జగం బెల్ల వర్తించు నెపుడు నాదు*
*శక్తి వలననె యని యెంచి జ్ఞాను లెపుడు*
*నన్నె సద్భక్తి గొల్చుచున్నారు విజయ !*

**తాత్పర్యము :-** నేనే సమస్త జగత్తునకు ఉత్పత్తి కారణమైనవాఁడను. నా వలననే ఈ సమస్తమును నడుచుచున్నది అని వివేకవంతులు తెలిసికొని పరిపూర్ణ భక్తిభావముతోఁ గూడినవారై నన్ను భజించుచున్నారు.

**శ్లో. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।**
**కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥** 9

*తే.గీ. చిత్త మెప్పుడు నాయందె జేర్చి తనదు*
*ప్రాణమును గూడ నాయందె పదిలపరచి*
*నన్నుగూర్చి పరస్పర మన్నివిధుల*
*జెప్పుకొంచును పరితృప్తి జెందుచుంద్రు.*

**తాత్పర్యము :–** నాయందు మనస్సు గలవారు నన్ను పొందిన ఇంద్రియములు గలవారై నన్నుగూర్చి పరస్పరము బోధించుకొనుచు ముచ్చటించుకొనుచు ఎల్లప్పుడును సంతృప్తిని, ఆనందమును పొందుచున్నారు.

**శ్లో. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ॥** 10

*తే.గీ. నిత్యసంప్రీతి నన్ను ధ్యానించునట్టి*
*జ్ఞానులకు నన్నుఁ బొందంగఁ జాలు విమల*
*బుద్ధి యోగంబు నిత్తు సమ్మోదముననుు*
*పాశుపతబలసంపన్న ! పాండుపుత్ర !*

**తాత్పర్యము :–** ఎల్లప్పుడు నాయందు మనస్సుగలవారై ప్రీతితో నన్ను సేవించునట్టివారికి దేనిచే వారు నన్ను పొందఁగలరో అట్టి జ్ఞానయోగమును ప్రసాదించుచున్నాను.

**శ్లో. తేషా మేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః ।**
**నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥** 11

*తే.గీ. వారిపై నెంతొ దయఁ జూపఁ గోరి నేను*
*వారిభావంబులందున్నవాఁడ నగుచు*
*వారి యజ్ఞాన మోహాంధకార మెల్ల*
*పారద్రోలుదు జ్ఞానదీపమ్ము చేత.*

**తాత్పర్యము :–** వారికి దయఁజూపుట కొఱకు నేనే వారి అంతఃకరణము లందు నిలిచి ప్రకాశమానమైన జ్ఞానదీపముచేత, అజ్ఞానజన్యమైన అంధకారమును నశింపఁజేయుచున్నాను.

అర్జున ఉవాచ :-

శ్లో. పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవమజం విభుమ్ ॥ 12

ఆహు స్త్వాం ఋషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥ 13

*తే.గీ. అనిన యదుకుల నందనుఁ గని కిరీటి
దేవ ! దేవర్షి నారద దేవలాసి
తులును వ్యాసాది మునిపుంగవులును గూడ
పరమపావనుఁ డని పరబ్రహ్మ వనియు
దివ్యపురుషుండ వని యాదిదేవుఁడ వని
తగ విభుఁ డజుఁడు పరంధాముఁ డనియు
నిన్ను వర్ణించుచుందురు - నీవు నట్లె
పలుకుచున్నాఁడ విపుడు శ్రీవాసుదేవ !*

**తాత్పర్యము :-** అర్జునుఁ డిట్లు అనుచున్నాఁడు : నీవు పరబ్రహ్మవు, పరంధాముఁడవు, పరమపావనుఁడవు. నిన్ను నిత్యునిగ, ప్రకాశరూపునిగ, పరమపురుషునిగ, ఆదిదేవునిగ, జన్మరహితునిగ, సర్వవ్యాపకునిగ, ఋషు లందరున్ను, దేవర్షియైన నారదుఁడున్ను, అసితుఁడున్ను, దేవలుఁడున్ను, వేదవ్యాసమహర్షియు వర్ణించుచున్నారు. స్వయముగా నీవును ఆ ప్రకారముగనే వర్ణించుచున్నావు.

శ్లో. సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ ।
నహి తే భగవన్ ! వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥ 14

*తే.గీ. ఎన్నగా నీవు చెప్పుచు నున్న వన్ని
సత్యమని యెంచుచున్నాను స్వామి ! నీదు
దివ్య మహిమంబులం గూర్చి దేవతలును
దానవులుఁ గూడ తెలియంగఁ దరముఁ గాదు.*

**తాత్పర్యము :-** ఓ కృష్ణా ! దేనిని నీవు నాకు చెప్పుచున్నావో అది అంతయు సత్య మని నేను తలచుచున్నాను. ఓ భగవంతుఁడా ! నీ నిజ స్వరూపమును దేవతలుగాని, అసురులుగాని తెలియఁజాలరు గదా !

శ్లో. స్వయ మేవాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15

తే.గీ. సకలప్రాణుల సృష్టింపఁ జాలు దీవు
సకలజీవులఁ బోషింపఁ జాలు దీవు
దేవదేవ ! జగత్పతీ ! దీనబంధు !
నిన్నెఱుంగుదు స్వయముగా నీవె తండ్రి !

**తాత్పర్యము :–** ఓ పురుషశ్రేష్ఠా ! సమస్తప్రాణులను సృష్టించు ఓ స్వామీ! సకల జీవులకు నియామకుఁడైనవాఁడా ! జగన్నాథా ! నిన్ను నీవే ఎఱుగుదువు; నీ స్వరూప మితరులకు దుర్గ్రాహ్యము సుమా !

శ్లో. వక్తు మర్హస్య శేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

తే.గీ. దివ్య మహిమోన్నతంబులఁ దేజరిలుచు
పేర్మి నీ లోకములను వ్యాపించినావు
కావునన్ నీదు ఘన మహిమావళులను
నీవె తెలుపంగఁ గలవయ్య ! నీరజాక్ష !

**తాత్పర్యము :–** కావున ఏ విభూతులచే నీవు ఈ లోకములన్నింటిలో వ్యాపించియున్నావో అట్టి దివ్యములైన నీ విభూతులను సంపూర్ణముగఁ జెప్పుటకు నీవే తగియున్నావు.

శ్లో. కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్ ।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవ న్మయా ॥ 17

తే.గీ. శ్రీశ ! యోగీశ్వరా ! భక్త చిత్తవాస !
ఏ విధంబుగ సతము నేభావములను
నిన్ను జింతించి ధ్యానించి సన్నుతించి
తెలిసికోగలనో ? నాకుఁ దెలుపు తండ్రి !

**తాత్పర్యము :-** ఓ యోగీశ్వరా ! నే నెల్లప్పుడు ఏ ప్రకారముగ ధ్యానించి నిన్ను తెలిసికొనగలను ? భగవంతుఁడా ! ఏ ఏ వస్తువులలో నిన్ను నేను ధ్యానింపవలెను; స్పష్టముగాఁ దెలుపుము.

**శ్లో. విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।**
**భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18**

*తే.గీ. నీ మహాద్భుత యోగంబు నీ విభూతి*
*మరల విపులముగాఁ దెల్పు మురగశయన !*
*వినఁగ వినఁగ నా కెంతైన వినవలె నని*
*ఆశఁ గొల్పెడి నీదు వాక్యామృతమ్ము.*

**తాత్పర్యము :-** ఓ జనార్దనా ! నీ ఐశ్వర్యవిశేషమును, విభూతిని వివరముగా నాకు మరల తెలియఁజేయుము. అమృతమువంటి అద్భుతమైన నీ వాక్కులను ఎంత విన్నను నాకు తనివితీరుట లేదు.

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।**
**ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥ 19**

*తే.గీ. అనుచుఁ గోరిన యర్జునుఁ గని మురారి*
*పలికె నిట్లని కౌంతేయ ! భవ్యమైన*
*నాదు దివ్య విభూతు లనంతములగు*
*ముఖ్యములు నైన వాని జెప్పుదును వినుము.*

**తాత్పర్యము :-** అర్జునుని కోరికను తెలిసికొని శ్రీకృష్ణుఁడు ఇట్లు పలుకుచున్నాఁడు "ఓ కురుశ్రేష్ఠా ! దేవతాసంబంధమైన నా విభూతులను విస్తరించి చెప్పుట మొదలుపెట్టినచో అంత మనునది యుండదు. కనుక వాటిలో ముఖ్యమైనవి నీకు వివరించెదను; వినుము."

**విశేషార్థము :-** "భూయః కథయ" అని అర్జునుఁడు కోరుటలో అతని 'జిజ్ఞాస' తెలిసికొనవలెననెడి కుతూహలము వ్యక్త మగుచున్నది.

**శ్లో. అహ మాత్మా గుడాకేశ ! సర్వభూతాశయస్థితః ।**
**అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మన్త ఏవ చ ॥ 20**

*తే.గీ. అఖిల భూతాల నున్న జీవాత్మ నేనె*
*ఆది మధ్యాంతములు నేనె, అఖిల జగతి*
*సృష్టి సుస్థితి లయముల జేతు నేనె*
*నా మహిమ లనంతంబులు నద్భుతములు.*

**తాత్పర్యము :-** నిద్రను జయించిన ఓ పాండుకుమార ! సర్వ ప్రాణులయందుఁ గూడ ఆత్మరూపములో ప్రకాశించువాఁడను నేనే. ఈ ప్రాణికోటి కంతకు ఉత్పత్తి, స్థితి, లయములకు నేనే కారణమై యొప్పు చున్నాను.

**శ్లో. ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।**
**మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥ 21**

*తే.గీ. తేజసుల నంశుమంతుఁడౌ దినకరుఁడును*
*అరయ నాదిత్యులన్ విష్ణు వగుదు నేను*
*వాయువులయందున మరీచి వాయు వేనె*
*చంద్రుఁడను నేనె నక్షత్ర సమితియందు.*

**తాత్పర్యము :-** ద్వాదశాదిత్యులలో 'విష్ణువు' అను పేరుగల ఆదిత్యుఁడను నేను. తేజస్సులలో అంశుమంతుఁడైన 'సూర్యుఁడ'ను నేను. వాయువులలో 'మరీచి' అను వాయువును నేను. అన్ని నక్షత్రములలోను 'చంద్రుఁడ'ను నేను.

**శ్లో. వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః ।**
**ఇన్ద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా ॥ 22**

*తే.గీ. వేదములు నాల్గిటన్ సామవేద మేనె*
*సకల దేవతలందు వాసవుఁడ నేనె*
*ఇంద్రియావళిలో మనస్సేనె విజయ !*
*అఖిల భూతాళి చైతన్య మగుదు నేనె.*

**తాత్పర్యము :-** వేదములలో సామవేదమును నేను; దేవతలలో ఇంద్రుఁడను నేను. జ్ఞాన, కర్మేంద్రియములలో మనస్సును నేను. దేహేంద్రియములతోఁ గూడిన ప్రాణికోటిలోఁ గానవచ్చు చైతన్యమును నేను.

**శ్లో. రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్ష రక్షసామ్ ।**
**వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్ ॥ 23**

*తే.గీ. వరల రుద్రులలోన శంకరుఁడు నేనె*
*యక్షరాక్షసులఁ గుబేరుఁ డౌదు నేనె*
*వసువులందున నెన్నఁ బావకుఁడు నేనె*
*శిఖరులందున మేరు నచ్ఛిఖర మేనె.*

**తాత్పర్యము :-** ఏకాదశ రుద్రులలో శంకరుఁడను నేనే. యక్ష రాక్షసులలో కుబేరుఁడను నేను. అష్టవసువులలో అగ్నిని నేను. పర్వతాలలో మేరుపర్వతము నేను.

**శ్లో. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।**
**సేనానీనా మహం స్కన్ద స్సరసా మస్మి సాగరః ॥ 24**

*తే.గీ. అతులితానూన సత్పురోహితులలోన*
*పరమ శ్రేష్ఠుండునౌ బృహస్పతిని నేను*
*ప్రబల సేనాధిపతులందు స్కందుఁ డేను*
*వర సరస్సుల విపుల సాగరము నేను.*

**తాత్పర్యము :-** రాజపురోహితులలో కెల్ల ప్రసిద్ధి కెక్కిన బృహస్పతిని నేను. సేనాపతులందఱిలో కుమారస్వామిని నేను. సరస్సు లన్నింటిలో సాగరమును నేను.

**శ్లో. మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్ ।**
**యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ 25**

తే.గీ. వర మహర్షుల భృగు వేను, భవ్యవేద
వాక్కులందు నేకాక్షర ప్రణవ మేను,
యజ్ఞములలోన జపయజ్ఞ మౌదు నేను
స్థావరములందు ఘన హిమశైల మేను.

**తాత్పర్యము :-** మహర్షులలో 'భృగువు'ను నేను. వాక్కులలో కెల్ల అక్షరరూపమైన ప్రణవమును (ఓంకారమును) నేను. యజ్ఞములలో జపయజ్ఞమును నేను. స్థావరములైన వానిలో హిమవత్పర్వతమును నేను.

**శ్లో. అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।**
**గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥** 26

తే.గీ. వృక్షములలోన నశ్వత్థ వృక్ష మేను
ప్రథిత దేవర్షులందు నారదుఁడ నేను
ప్రాజ్ఞ గంధర్వులను చిత్రరథుఁడ నేను
పూజ్యసిద్ధులఁ గపిలాఖ్య మునియు నేను.

**తాత్పర్యము :-** వృక్షములలో అశ్వత్థ వృక్షమును (రావిచెట్టును) నేను. దేవర్షులలో నారదుఁడను నేను. గంధర్వులలో చిత్రరథుఁడను నేను. సిద్ధులలో కపిలుఁడను పేరుఁగలవాఁడను నేను.

**శ్లో. ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।**
**ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥** 27

తే.గీ. వరలు నశ్వాల నమృతోద్భవంబునైన
భవ్యమైనట్టి యుచ్చైశ్శ్రవమ్ము నేను
వరలునైరావతమ్మను నరులలోన
తెలియు మో యర్జునా ! నరాధిపుఁడ నేను.

**తాత్పర్యము :-** క్షీరసాగర మథనకాలములో పుట్టిన అశ్వము ఉచ్చైశ్శ్రవమును నేను. ఏనుగులలో ఐరావతమును నేను. మనుష్యులలో రాజ్యమును పాలించే రాజును నేను.

**శ్లో. ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।**
**ప్రజన శ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః ॥ 28**

*తే.గీ. ఆయుధంబుల నేను వజ్రాయుధమును*
*ధేనువులలోన వరకామధేను వేను*
*తగు ప్రజోత్పత్తి హేతు కందర్పు డేను*
*ప్రకటసర్పాలలోన వాసుకుని నేను.*

**తాత్పర్యము :-** ఆయుధములలో వజ్రాయుధము నేను. గోవులన్నిటిలో కామధేనువును నేను. ప్రజలపుట్టుకకు కారకుడైన మన్మథుడను నేను. పాములలో వాసుకి యను పేరు గల సర్పరాజును నేను.

**శ్లో. అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్ ।**
**పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్ ॥ 29**

*తే.గీ. నాగములలో ననంతుడన్ నాగ మేను*
*భవ్యజలదేవతలలోన వరుణు డేను*
*అరయ పితృదేవతాళి నర్యముడ నేను*
*న్యాయ పాలకులందున యముడు నేను.*

**తాత్పర్యము :-** నాగ కులములో నేను 'అనంతుడ'ను పేరుగల నాగరాజును. జలదేవతలలో వరుణుడను. పితృదేవతలలో అర్యముడను ప్రభువును నేను. న్యాయమును పాలించు వారిలో యముడను నేను.

**శ్లో. ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్ ।**
**మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయ శ్చ పక్షిణామ్ ॥ 30**

*తే.గీ. అఖిల దైత్యులలోన ప్రహ్లాదు డేను*
*కలయ లెక్కించువారిలో గాల మేను*
*మృగములందున సింహమ్ము, మేల్మి పక్షి*
*కులమునందున గరుడుండ కుంతిపుత్ర !*

**తాత్పర్యము :-** దైత్యవంశములో ప్రఖ్యాతుడైన ప్రహ్లాదుడను నేను. ఆయువును లెక్కించువారిలో కాలమును నేను. మృగములన్నింటిలో సింహమును నేను. పక్షికులములో గరుత్మంతుడను నేను.

**శ్లో. పవనః పవతా మస్మి రామ శ్శస్త్ర భృతా మహమ్ ।**
**ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ॥**

తే.గీ. పావన మొనర్చువారిలోఁ బవనుఁ డేను
శస్త్రధారుల శ్రీరామచంద్రుఁ డేను
ఝషముల వినుత మకర మౌదును నరేంద్ర !
అరయఁగాఁ బుణ్యనదుల జాహ్నవిని నేను.

**తాత్పర్యము :-** పవిత్ర మొనర్చుటలో పవనుఁడను నేను. ధను ధరించిన వారిలో శ్రీరామచంద్రుఁడను నేను. జలజంతువులలో మొస నేను. నదులన్నిటిలో గంగానదిని నేను.

**శ్లో. సర్గాణా మాది రన్త శ్చ మధ్యం చైవాహ మర్జున ।**
**అధ్యాత్మవిద్యావిద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥**

తే.గీ. శ్వేతవాహన ! ఈ జగత్సృష్టి కెల్ల
ఆది మధ్యాంతములు నేనె యగుదు నుమ్మ
విద్యలందున సద్బ్రహ్మ విద్య నేను
వాద, జల్ప, వితండాల వాద మేను.

**తాత్పర్యము :-** అర్జునా ! ఈ జగత్తులోని సృష్టికి ఆది, మధ్య, అంత నేనే. విద్యలలో బ్రహ్మవిద్యను నేనే. వాదము లన్నిటిలో అర్థనిర్ణయముఁ జే హేతువాదము నేనే.

**శ్లో. అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ ।**
**అహ మేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః ॥**

తే.గీ. కనగ నక్షరములలో 'అ'కార మేను
తగ సమాసములందున ద్వంద్వ మేను
గణ్య మయి నాశ మెఱుఁగని కాల మేను
సర్వతోముఖబ్రహ్మ నేన్ సవ్యసాచి !

**తాత్పర్యము :-** వర్ణములలో 'అ'కారమును నేను. సమాసముల ద్వంద్వ సమాసమును నేను. నాశములేని కాలమును నేను. కర్మలకు ఫలమ నిచ్చు చతుర్ముఖ బ్రహ్మను నేను.

శ్లో. మృత్యు స్సర్వహరశ్చాహ ముద్భవ శ్చ భవిష్యతామ్ ।
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా ॥ 34

తే.గీ. సకల జగముల హరియింపఁ జాలు నట్టి
మృత్యువును నేనె యుద్భవ మెన్న నేనె
స్త్రీల సిరి, కీర్తి, వాక్కును, స్మృతియు, ధృతియు,
క్షమయు, మేధయు నేనె నిశ్చయము పార్థ!

**తాత్పర్యము :-** లోకములన్నిటిని హరించు మృత్యువును నేనే. భవిష్యత్తులోఁ గలుగు శుభాశుభ ఫలములకు మూలకారణము నేను. స్త్రీలకు సంబంధించిన సంపద, కీర్తి, వాక్కు, స్మృతి, మేధ, ధృతి, క్షమ మొదలైన గుణము లన్నియు నేనే అని తెలిసికొనుము.

శ్లో. బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః ॥ 35

తే.గీ. సామముల నెన్నఁగా బృహత్సామ మేను
అలరు ఛందస్సులందు గాయత్రి నేను
జగతి మాసాల మార్గశీర్షమ్ము నేను
షడృతువులందు భవ్య వసంత మేను.

**తాత్పర్యము :-** సామములలో 'బృహత్' అనెడి సామమును నేనే. ఛందస్సు లన్నింటిలో 'గాయత్రీ' ఛందస్సును నేను. మాసములలో మార్గశిర మాసమును నేను. ఋతువులలో వసంత ఋతువును నేను.

శ్లో. ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్ ॥ 36

తే.గీ. తనరు వంచనలందు జూదమును నేను
దివ్యతేజాధిపులయందు తేజ మేను
విజయధనుల విజయము, పవిత్ర యత్న
పరుల యత్నము, బలుల సద్బలము నేను.

**తాత్పర్యము :-** ఈ ప్రపంచములోని మోసములలో జూదమును నేను. తేజోవంతులలో ఉండు తేజస్సును నేను. జయముపొందువారిలోని జయమును నేను. బలవంతులైనవారిలో బలమును నేను. ప్రయత్నశీలురలోని ప్రయత్నమును నేను.

**విశేషార్థము :-** సత్త్వగుణప్రధానములైన యోగములలోని సత్త్వ గుణమును నేనే అని విశేషము.

**శ్లో. వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః ।**
**మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనాకవిః ॥** 37

*తే.గీ. యదుకులాంబుధి శ్రీకృష్ణుఁ డౌదు నేను*
*పాండునందనులం దర్జునుండ నేను*
*మునులలో వ్యాసుఁడన్ నేను ఘనకవీంద్ర*
*కోటిలోపల నెన్న శుక్రుఁడను నేను.*

**తాత్పర్యము :-** యదువంశమున పుట్టినవారిలో వసుదేవుని కుమారుఁడనుగా పుట్టినవాఁడను నేను. పాండుపుత్రులలో అర్జునుఁడను నేను. మునులలో వేదవ్యాసుఁడను నేను. కవులలో శుక్రుఁడను కవిని నేను.

**విశేషార్థము :-** "పాణ్డవానాం ధనంజయః" - అనుటలో నీవు నేనే అని చెప్పుట గమనింపవలయును.

**శ్లో. దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్ ।**
**మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥** 38

*తే.గీ. నియతి దండించు ప్రజ దండనీతి నేను*
*వర జయేచ్ఛాళి దగు జయోపాయ మేను*
*మహి రహస్యములందున మౌన మేను*
*జ్ఞానవంతుల యాత్మ సుజ్ఞాన మేను.*

**తాత్పర్యము :-** మంచి మార్గములో నడచుటకు ఇచ్చు 'శిక్ష'ను నేను. రాజులలోని జయకాంక్షలో గల రాజనీతిని నేను. రహస్యములలో ప్రకాశించు 'మౌనము'ను నేను. జ్ఞానవంతులలో జ్ఞానమును నేను.

**శ్లో. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున ।**
**న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥ 39**

*తే.గీ. సర్వ భూతావళికిని బీజమ్ము నైన*
*నన్ను విడి యుండ దిలలోన నున్న దేదియు*
*ఈ చరాచర జగమునం దెవుడు నేను*
*దేనినిం గూడ విడియుండ( బోను విజయ !*

**తాత్పర్యము :-** అర్జునా ! చరాచరరూపమైన అఖిలభూతములకు కారణమును నేనే. సృష్టిలోని ప్రాణకోటి సమస్తము నన్ను విడిచియుండ నేరదు. దేనిని గూడ విడిచి నేను ఉండ(జాలను.

**విశేషార్థము :-** నేను లేని పదార్థ మొక్కటి కూడ లేదు. జగ మంతయు నేనే ఆత్మగా గలది అని భావము.

**శ్లో. నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।**
**ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥ 40**

*తే.గీ. దివ్య మైనట్టి నా విభూతికిని నెపుడు*
*అంత మనునది లేదు లేదయ్య విజయ !*
*ఇదివఱకు నీకు( జెప్పిన దెల్ల( గూడ*
*నా విభూతుల( గొంతయే నయ్య పార్థ !*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! దివ్యమైన నా అనుభూతికి అంత మనునది లేదు. విస్తరించి చెప్పినకొలది అది పెరిగిపోవును. కావున నీకు సంగ్రహముగా ఇంతవఱకు చెప్పితిని.

**శ్లో. యద్య ద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసమ్భవమ్ ॥ 41**

*తే.గీ. తనర నైశ్వర్య విక్రమోత్సాహములను*
*ప్రబల మయి మేల్మి సత్కాంతివంత మగుచు*
*అనుపమానమ్ముగా వెల్గు నట్టి వెల్ల*
*భవ్య నాదివ్య తేజోద్భవంబు లరయ.*

**తాత్పర్యము :-** ఈ లోకములో విక్రమము, ఉత్సాహము, కాంతి, విభవము కలిగి ప్రకాశించు సర్వ పదార్థములును నా తేజస్సువలన సంభూతములే యని నీవు తెలిసికొనుము.

**శ్లో. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।**
**విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ 42**

*తే.గీ. అటుల కాదేని విస్తారమైన యట్టి*
*ఈ విశిష్ట సుజ్ఞాన మదేమి నీకు*
*ఘన ప్రయోజనకారి కాగలదు పార్థ !*
*జగతి బర్విలి నొక్క యంశమ్ముచేత.*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఇదంతయు నీకు నింత విపులముగా చెప్ప నేల ? కంటికి కనిపించు ఈ ప్రపంచ మంతయు నాయొక్క ఒక అంశముతోనే ప్రవర్తించుచున్నది.

**విశేషార్థము :-** ఇందుగలను, అందుగలను, అని భగవంతుడు చెప్పుటచేత ప్రయోజనము లేదని, సర్వాంతర్యామినై జగమంతట నిండియున్నానని చెప్పుట జరిగినది.

*ఇందుగల, డందు లేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుం-డను పద్యములోని -* విశేషార్థమును ఇదియే.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
విభూతియోగంబను
పదియవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'



శ్లో. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ ॥

(11-5)

ఓ పార్థా ! నాయొక్క దివ్యమైనట్టి, నానావిధములైన, బహువిధ రూపములతోను రంగులతోను ప్రకాశించుచున్న వందలు మఱియు వేలకొలది రూపములను చూడుము.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం ఏకాదశోఽధ్యాయః

## విశ్వరూప సందర్శన యోగము

*శ్రీ అర్జున ఉవాచ :-*

**శ్లో. మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్ ।**
**యత్త్వయోక్తం వచ స్తేన మోహోఽయం విగతో మమ ॥** 1

*తే.గీ. అనిన పరమాత్ముతో నిట్లు లనె గిరీటి*
*నన్ననుగ్రహింపంగ నాపన్నశరణ !*
*అతిరహస్య మైనట్టి యధ్యాత్మ విషయ*
*జ్ఞాన మొసగితి నాకు నజ్ఞాన మెడలె.*

**తాత్పర్యము :-** భగవత్ విభూతినిగూర్చి వినిన అర్జునుడు భగవత్ స్వరూపమును చూచుటకు కుతూహలముతో ఇట్లనుచున్నాడు. "ఓ కృష్ణా! నీవు నన్ను ధన్యాత్ముని జేయవలెనని శ్రేష్ఠమును, అతిరహస్యమును, ఆత్మానాత్మ విజ్ఞానమునైన విషయమును తెలిపితివి. దానివలన నా ఆత్మలోని మోహ మంతయు మాయమైపోయినది."

**శ్లో. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।**
**త్వత్తః కమలపత్రాక్ష ! మాహాత్మ్య మపి చావ్యయమ్ ॥** 2

*తే.గీ. ప్రాణికోటుల యుత్పత్తి ప్రళయములను*
*నిత్య సత్యమౌ నీదు మాహాత్మ్యములును*
*స్పష్టముగ దెల్పితివి నాకు సదయహృదయ !*
*ధన్యుడను నే నిలన్ ముకుందా ! మహాత్మ !*

**తాత్పర్యము :-** ఓ పద్మనేత్రా ! ప్రాణికోటుల ఉత్పత్తి లయములను, నాశములేని నీ మాహాత్మ్యమును గూడ తెలియఁజేసితివి. నేను వీనుల విందుగా విని తరించితిని.

**శ్లో. ఏవ మేత ద్యథాఽఽత్థత్వ మాత్మానం పరమేశ్వర !**
**ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ !** 3

*తే.గీ. నిన్ను గూర్చి నీ వన్నవి యన్నిగూడ*
*నిజమె సత్యమె యౌను గానీ ప్రపూజ్య !*
*ఐశ్వరంబైన నీ రూప మవని జూడ*
*కోరికలు గల్గె నాకు శ్రీ నీరజాక్ష !*

**తాత్పర్యము :-** ఓ కృష్ణా ! నీవు వివరించిన దంతయు సత్యమే. నీవు చెప్పిన ప్రకారము ఐశ్వర్య శోభితమైన నీ రూపమును కనులారఁ గాంచవలెనని నాకు కోరిక కలుగుచున్నది.

**శ్లో. మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో !**
**యోగీశ్వర తతో మే త్వం దర్శ యాత్మాన మవ్యయమ్ ॥** 4

*తే.గీ. అట్టి నీ విశ్వరూపమ్ము నరసిచూడ*
*అర్హుఁడని నన్ను యోగేశ్వరా ! తలఁచిన*
*అవ్యయంబును భవ్యము దివ్యమైన*
*రమ్య మగు నీ స్వరూప దర్శనము నిమ్ము.*

**తాత్పర్యము :-** ప్రభూ ! యోగేశ్వరా ! దివ్యమైన నీ రూపమును చూచుట నాకు సాధ్యమగునని నీవు తలంచినట్లయిన, అవ్యయము, దివ్యమ్మైన నీ రూపమును నాకు చూపించుము.

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।**
**నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ ॥** 5

తే.గీ. అనిన యర్జును( గని కృష్ణు( డనియె - పార్థ !
వివిధ వర్ణాకృతులతోడ వివిధము లయి
శత సహస్రాధికము లయి సన్నుత మయి
దివ్య మగు నాదురూపాల( దెలియ( గనుము.

**తాత్పర్యము :-** ఓ పార్థా ! నాయొక్క దివ్యమైనట్టి, నానావిధములైన, బహువిధ రూపములతోను రంగులతోను ప్రకాశించుచున్న వందలు మఱియు వేలకొలది రూపములను జూడుము.

**శ్లో. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా ।**
**బహూ న్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత !** 6

తే.గీ. ద్వాదశాదిత్యులను నష్టవసుగణమును
అశ్వినీ దేవతల మరుత్తాళి మఱియు
పదియు నొక్కండ్రు రుద్రుల( బరగ( గనుము
అలర( గను పూర్వ మెఱుగని యద్భుతములు.

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ద్వాదశ (12) ఆదిత్యులను, అష్ట (8) వసువులను, ఏకాదశ (11) రుద్రులను, సప్త (7) మరుత్తులను (వాయువులను); అశ్వినీ దేవతలను చూడుము. ఇదివఱ కెన్నడును చూడనట్టి, ఆశ్చర్యజనకము లయిన అనేకములైన వానిని చూడుము.

**శ్లో. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి ॥** 7

తే.గీ. సకలమైనట్టి యీ చరాచర జగమును
ఇంక నేమేమి కానంగ నిచ్ఛగింతొ
ఇప్పు డీ నాదు దేహమందే గనంగ(
జాలుదువు గుడాకేశ ! నిశ్చయముగా(గ.

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఇప్పుడు నా శరీర మందున్నట్టి సచరాచరమైన ప్రపంచమునంతను చూడుము. ఇంకను నా శరీరములో ఏమేమి వస్తు విశేషములను చూడదలచితివో వాని నన్నిటిని చూడుము.

**విశేషార్థము :-** గుడాకేశ ! చక్కని సంబోధనము.

**శ్లో. న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్ ॥ 8**

*తే.గీ. ప్రాకృతాజ్ఞాన చర్మనేత్రములచేత*
*నన్నుఁ గన నీకు శక్తిలే దెన్నటికిని*
*దివ్యచక్షువు లొసఁగెద భవ్యముగను*
*నాదు యోగ మహిమముఁ గానంగ గలవు.*

**తాత్పర్యము :-** మానవమాత్ర నేత్రములతో నన్ను చూడలేవు. కావున దివ్య నేత్రమును ప్రసాదించుచున్నాను. దానితో నా యోగవిభూతిని చూడుము.

*సంజయ ఉవాచ :-*

**శ్లో. ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగీశ్వరో హరిః ।**
**దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥ 9**

*తే.గీ. అని మహాయోగివరుఁ డైనయట్టి కృష్ణుఁ*
*డలర పరమోన్నతంబైన యట్టి తనదు*
*విశ్వరూపంబుఁ జూపించె విజయునకును*
*రమ్యగుణతేజ ! శ్రీ ధృతరాష్ట్రరాజ !*
*అనుచు వివరించె సంజయుఁ డమిత భక్తితో.*

**తాత్పర్యము :-** ఓ ధృతరాష్ట్ర మహారాజా ! యోగీశ్వరుఁడగు కృష్ణుఁడు అర్జునునితో అట్లు చెప్పి పరమోత్కృష్టమైన తన దివ్యరూపమును అతనికి ప్రదర్శించినాడు.

**శ్లో. అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్ ।**
**అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10**

*తే.గీ. బహుముఖ వినుత బహునేత్ర భాసురమ్ము*
*మానితాద్భుత దృశ్య సమన్వితమ్ము*
*దివ్య భవ్యాభరణ శస్త్రతేజయుతము*
*అది యపూర్వ మనన్యంబునౌ నరేంద్ర !*

**తాత్పర్యము :-** అది అనేక ముఖములతోను, నేత్రములతోను నిండినది. వింత( గలిగించు అనేక దృశ్యములు( గలది. దివ్యమైన అలంకారాలతో నలరారు నట్టిది. అనేక దివ్యాయుధములతో( గూడినది.

**శ్లో. దివ్య మాల్యాంబర ధరం దివ్యగన్ధాను లేపనమ్ ।**
**సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥** 11

*తే.గీ. దివ్యమాల్యాంబరధరుండు దివ్యగంధ*
*చర్చితోన్నత దేహు( డాశ్చర్యమయు(డు*
*భువన వందిత విశ్వతోముఖు( డనంతు(*
*డయిన దేవుని దర్శించె నర్జునుండు.*

**తాత్పర్యము :-** దివ్యములైన పుష్పమాలికలతోడను, గంధములతోడను, దివ్య వస్త్రములతోడను గూడి మిక్కిలి ప్రకాశించునదై అన్ని దిక్కులలోను వ్యాపించియున్న సర్వతోముఖమైన అనంతుని రూపమును అర్జును(డు చూచెను.

**శ్లో. దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా ।**
**యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥** 12

*తే.గీ. గగనమందు సహస్రభాస్కరులు నొక్క*
*సారిగా( బుట్టి రేని యే తీరు గా(గ*
*కాంతి భాసించునో యట్టి కాంతితోడ*
*వరలు( దగు( బోల్ప నమ్మహాపురుషు కాంతి.*

**తాత్పర్యము :-** ఆ సమయములో ఆ దివ్య పురుషుని శరీరకాంతి ఆకాశములో వేయి సూర్యు లొక్కసారిగా ఉదయించిన కలుగునట్టి అద్భుతమైన వెలుగుతో( బోల్చ(దగియుండెను.

**శ్లో. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।**
**అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా ॥** 13

*తే.గీ. దేవదేవుఁడౌ శ్రీకృష్ణ దివ్యమైన*
*విశ్వరూపమ్మునందున వివిధములుగ*
*విభజనము సేయబడియుండు విశ్వ మెల్ల*
*ఒక్కచోటున గనె పార్థుఁ డక్కజముగ.*

**తాత్పర్యము :-** అర్జునుఁడు శ్రీకృష్ణుఁడు తనకు ప్రదర్శించిన విశ్వరూపములో ఆతని శరీరములో అనేకవిధములుగా విభజింపబడియున్న సర్వప్రపంచమును గాంచి విస్మయ మందినాడు.

**శ్లో. తత స్స విస్మయావిష్టో హృష్ట రోమా ధనంజయః ।**
**ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత ॥** 14

*తే.గీ. విస్మయావిష్టుఁ డౌచు నా విజయుఁ డంత*
*పులకిత శరీరుఁ డౌచు నంజలి ఘటించి*
*మస్తకము వాల్చి మిగుల సంబరముతోడ*
*వాసుదేవుని గాంచి తాఁ బలికె నిట్లు.*

**తాత్పర్యము :-** శ్రీకృష్ణుని దివ్యరూపమును జూచుటతోడనే అత్యంతాశ్చర్యమును పొందినవాఁడై, సంతోషముతో పులకాంకురాలు పొడముచుండ శిరస్సువంచి నమస్కరించి, చేతులు జోడించి పరమేశ్వరునితో నిట్లు అనుచున్నాడు.

*అర్జున ఉవాచ :-*

**శ్లో. పశ్యామి దేవాం స్తవ దేవదేహే**
**సర్వాం స్తథా భూత విశేష సఙ్ఘాన్ ।**
**బ్రహ్మాణ మీశం కమలాసనస్థం**
**ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥** 15

*తే.గీ. దేవదేవేశ ! నీ దివ్య దేహమందు*
*నేను చూచుచు నున్నాను నిఖిల మునుల,*
*సుర గణంబుల, బ్రహ్మను నురగచయము*
*సకల భూతంబులన్ బ్రశస్తముగ నిపుడు.*

**తాత్పర్యము :-** దేవా ! నీ దేహములో దేవతలను, స్థావరజంగమ సృష్టిని, ఈశ్వరుని, కమలాసనుడైన బ్రహ్మను, సర్వ ఋషులను, దేవతా సంబంధములైన పాములను చూచుచున్నాను.

**శ్లో. అనేక బాహూదర వక్త్రనేత్రం**
**పశ్యామి త్వాం సర్వతోఽనన్త రూపమ్।**
**నాన్తం న మధ్యం న పున స్తవాదిం**
**పశ్యామి విశ్వేశ్వర ! విశ్వరూప ! ॥ 16**

*తే.గీ. బహు భుజంబులు, బహునేత్ర, బహు ముఖములు*
*అరయఁగ బహూదరముల ననంతరూప*
*ధరుఁడవై యంతటను నిండి తనరు నీదు*
*ఆది మధ్యాంతములు కాన వయ్యె నాకు.*

**తాత్పర్యము :-** ఓ విశ్వేశ్వర ! విశ్వరూప ! అనేకములైన బాహువులును, ఉదరములు, ముఖములు, నేత్రములుఁ గలిగి అనేక రూపములుగల వానినిగా నిన్ను చూచుచున్నాను. ఈ విశ్వమునకంతకు నీవే విభుఁడవు. నీకు ఆదియు, మధ్యము, అంతము గోచరించుట లేదు.

**శ్లో. కిరీటినం గదినం చక్రిణం చ**
**తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా**
**ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ ॥ 17**

*తే.గీ. ఘన కిరీటము, చక్రము, గదయుఁ దాల్చి*
*అంతటను దీప్తి తేజంబు లలర మిగుల*
*జ్వలిత సూర్యాగ్ని సత్కాంతి వెలయఁ, జూడ*
*గాని యప్రమేయుని నిన్నుఁ గాంచుచుంటి.*

**తాత్పర్యము :-** గద, కిరీటము, చక్రముఁ గలిగి అన్ని దిక్కులందు వ్యాపించిన కాంతి పుంజములు గల్గి, తమ తేజోవిశేషముతోఁ జూచుటకు వీలుకాని సూర్యుఁడు, అగ్నివలె ప్రకాశించువానిని, అప్రమేయుఁడవగు నిన్ను అన్ని దిక్కులలోను జూచుచున్నాను.

శ్లో. త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే ॥ 18

తే.గీ. *తగ ముముక్షులు తెలియంగఁ దగినయట్టి*
*అక్షరంబౌ పరబ్రహ్మ మఖిల జగతి*
*కాశ్రయుఁడ వవ్యయుండవు నరయ నిత్య*
*ధర్మ రక్షకుఁడవు సనాతనుఁడ వీవు.*

**తాత్పర్యము :-** నీవు నాశములేనివాఁడవు. పరబ్రహ్మ స్వరూపము నీవే. ఈ జగమున కంతకు ఆధారభూతుఁడవు నీవే. నాశము లేని శాశ్వతమైన ధర్మమును కాపాడువాఁడవు నీవే. అందఱిచేతను తెలిసి కొనఁదగిన సనాతన పురుషుఁడవు నీవే అని నేను తలంచుచున్నాను.

శ్లో. అనాది మధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వ తేజసా విశ్వ మిదం తపన్తమ్ ॥ 19

తే.గీ. *ఆది మధ్యాంతములు లేనియట్టి వాని*
*అమిత వీర్యు ననంత హస్తముల వాని*
*అర్క హిమకర నేత్రు, హుతాశ వక్త్రు*
*జగతిఁ దపియించు తేజు నిన్ చాలఁ గంటి.*

**తాత్పర్యము :-** ఆదిమధ్యాంతము లేనివానిని, అంతులేని పరాక్రమముఁ గలవానిని, లెక్కలేనన్ని బాహువులు గలవానిని, సూర్యచంద్రు లిద్దఱును రెండు నేత్రములుగాఁ బ్రకాశించువానిని, జ్వలించు అగ్నిని ముఖముగాఁ గలిగినవానిని, ఈ జగము నంతయు కాంతిచే తపింపఁజేయువానిని నిన్ను చూచుచున్నాను.

శ్లో. ద్యావాపృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వ యైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ! 20

తే.గీ. దివికి భువికిని మధ్య ప్రదేశ మెల్ల
దిక్కులు విదిక్కులం దెల్ల దివ్యముగను
వ్యాపితంబై మహోగ్ర మహాద్భుతముగఁ
దనరు నీ రూపుఁ గని జగత్త్రయము వణకె.

**తాత్పర్యము :-** ఓ మహానుభావా ! భూమ్యాకాశముల మధ్య భాగము లోను, అన్ని దిక్కుల నడుమను ఒకటిగ వ్యాపించిన నీ రూపమును జూచు చున్నాను. అత్యాశ్చర్యమును గల్గించునది, భయంకరమునైన నీ రూపమును జూచి మూఁడు లోకములు వణకుచున్నవి.

**శ్లో. అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి**
**కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।**
**స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః**
**స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21**

తే.గీ. సురసమూహాళి నీయందు చొచ్చుచుండ
భీతిఁ గొందఱు ప్రార్థనసేతు రనఘ !
స్వస్తి బలుకుచు ఋషి సిద్ధ సంఘ మెల్ల
ప్రణతి నతియింత్రు పుష్కలార్థముల నిన్ను.

**తాత్పర్యము :-** దేవతా సమూహములు నీలో ప్రవేశించుచున్నవి. కొంతమంది భయముతో నమస్కరించుచు నిన్ను స్తుతించుచున్నారు. మునులు, సిద్ధులు "లోకము లన్నిటికి కల్యాణగుణ మగు గాక !" అని పలుకుచు నిన్ను స్తోత్రములతో స్తుతించుచున్నారు.

**శ్లో. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా**
**విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ ।**
**గన్ధర్వ యక్షా సురసిద్ధ సఙ్ఘా**
**వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే ॥ 22**

తే.గీ. రుద్రు లాదిత్యు లరయ మరుత్తులున్ను
సిద్ధ సాధ్యులు వసుర విశ్వేశ్వినులును
యక్ష గంధర్వ పితృదేవతాళి వసువు
లరయ నినుఁ గాంచి విస్మితు లగుదు రెపుడు.

**తాత్పర్యము :-** వసువులు, రుద్రులు, ఆదిత్యులు, సాధ్యులు, యతులు, విశ్వే దేవతలు, ఆశ్వినులు, రాక్షసులు, సిద్ధ గంధర్వులు, పితృ దేవతలు ఆశ్చర్యముతో నిన్ను జూచుచున్నారు.

**శ్లో. రూపం మహత్తే బహువక్త్రనేత్రం**
**మహాబాహో ! బహు బాహూరుపాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రా కరాళం**
**దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్ ॥ 23**

*తే.గీ. బహుముఖంబుల బహునేత్ర బహుపదముల*
*వరలెడు బహూరువుల బహుబాహువులను*
*మరి బహూదర బహుదంష్ట్ర మహితు నిన్నుఁ*
*గాంచ భయ మయ్యె నాకు లోకముల కెల్ల.*

**తాత్పర్యము :-** హే మహాబాహో ! నీ రూపముయొక్క పరిమాణము చాల గొప్పది. ఇన్ని ముఖములు, ఇన్ని పాదములు, ఇన్ని చేతులు, ఇన్ని ఉదరములు, ఇన్ని ఊరువులు, ఇన్ని కోఱలుఁ గల్గిన నీ యీ రూపమును జూచి లోకములోని ప్రాణులు మఱియు నేను నధికముగాఁ గంపించుచున్నాము.

**శ్లో. నభః స్పృశం దీప్త మనేకవర్ణం**
**వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్ ।**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథి తాన్తరాత్మా**
**ధృతిం న విన్దామి శమం చ విష్ణో ! 24**

*తే.గీ. ఆకసంబంట దీప్త వర్ణాంచితముగ*
*తెరువఁ బడినట్టి నోరును నిరుపమాన*
*ప్రజ్వలిత నేత్రములుఁ గలవాని నిన్నుఁ*
*గాంచ భయ మయ్యె ధైర్యమ్ము కలుగకుండె.*

**తాత్పర్యము :-** విష్ణూ ! ఆకాశమునంటుచు, ప్రకాశించుచు, అనేక వర్ణములతోఁ గూడి తెఱవఁబడిన నోరు, విశాలమైన కనులుఁ గలిగిన నీ రూపమును చూచినంత అంతఃకరణము చలించిపోయినది. ధైర్యము తొలఁగిపోయినది; మనశ్శాంతి లేకుండపోయినది.

శ్లో. దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ ! జగన్నివాస ॥ 25

*తే.గీ. ప్రళయ కాలాగ్నివలె నొప్పి భయముఁ గొల్పు*
*వాడి కోఱలుఁ గల్గు నీ వదనములను*
*చూచుచున్నాను దిక్కులు తోచవాయెఁ*
*గన ప్రసన్నుఁడ వగుము జగన్నివాస !*

**తాత్పర్యము :–** జగన్నివాస ! దేవేశ ! వికృతములైన కోఱలుఁ గలిగి ప్రళయ కాలాగ్నివలెనున్న నీ ముఖములను జూచిన నాకు దిక్కు తోచకున్నది. నాకు సుఖము లేకుండ ఉన్నది. కాబట్టి ఓ దేవా ! నన్ను దయఁజూడుము.

శ్లో. అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావని పాలసఙ్ఘైః ।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః ॥ 26

వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని ।
కేచి ద్విలగ్నా దశనాన్త రేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః ॥ 27

*తే.గీ. ధరణిపాల సమూహమ్ము, ధార్తరాష్ట్ర*
*చయము, కర్ణ భీష్మ ద్రోణ శౌర్యధనులు,*
*నాదు యోధులు, త్వరగతి నీదు వికృత*
*దంష్ట్రలను నొప్పు నోళులఁ దనరఁ జొచ్చు*
*చున్నవారలు కొందఱు చూచుచుండ*
*నీదు పండ్లలోఁ దగులుకొని పొడి పొడిగ*
*రాలుచున్నట్టి తమ శిరోరాశితోడ*
*గానుపించుచు నున్నారు కమలనయన !*

**తాత్పర్యము :-** రాజ సమూహములతోఁ గూడిన ఈ ధృతరాష్ట్ర పుత్రులందఱు భీష్మ ద్రోణులు, కర్ణుఁడు, నా పక్షములోని ముఖ్య యోధులు, వీరందఱు వేగముగా వికృతమైన కోఱలతోఁగూడి భయంకరమై ప్రకాశించు నీ ముఖములందు ప్రవేశించినట్లు, నీ కోఱల నడుమఁ గొందఱి తలలు నలిగి పొడి పొడి యగుచున్నట్లు నాకు కనఁబడుచున్నది.

**శ్లో. యథా నదీనాం బహవోఽమ్బువేగా**
**స్సముద్ర మేవాభిముఖా ద్రవన్తి।**
**తథా తవామీ నరలోకవీరా**
**విశన్తి వక్త్రా ణ్యభివిజ్వలన్తి ॥ 28**

*తే.గీ. అవనిలోన నదీ ప్రవాహంబు లెల్ల*
*అంబుధిని జేర పాఱుచున్నట్టి రీతిఁ*
*బ్రజ్వలించెడి నీ దివ్య వదనములను*
*చొచ్చుచున్నారు నరవీర శూరు లెల్ల.*

**తాత్పర్యము :-** అనేకములైన నదీ ప్రవాహములు వడిగా ప్రవహించుచు వచ్చి సముద్రములోఁ గలియు విధముగా ఈ యుద్ధ వీరులందఱు మిక్కిలిగా జ్వలించుచు నీ ముఖములలో ప్రవేశించుచున్నారు.

**శ్లో. యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా**
**విశన్తి నాశాయ సమృద్ధవేగాః।**
**తథైవ నాశాయ విశన్తి లోకా**
**స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29**

*తే.గీ. మిడుత లన్నియుఁ గడువడి మృతిని జెందఁ*
*బ్రజ్వలించెడి వహ్నిలోఁ బడెడి రీతి*
*సకల జనులును తమదు నాశంబుఁ గోరి*
*వ్రాలుచున్నారు వడి నీదు వదనములను.*

**తాత్పర్యము :-** మండుచున్న మంటలో మిక్కిలి వేగముగా వచ్చి పడిపోయి చనిపోయెడి మిడుతలదండువలె ఈ ప్రాణి సమూహ మంతయు రెట్టించిన వేగముతో నాశముఁ గోరి, నీ ముఖములలోఁ బ్రవేశించుచున్నారు.

శ్లో. లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకా న్సమగ్రాన్ వదనై ర్జ్వలద్భిః ।
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥ 30

తే.గీ. మండుచుండెడి నీ ముఖ మండలముల
సకల జనులను మ్రింగు చాస్వాదనంబు
చేయుచున్నావు, భయదమై చెలఁగు నుగ్ర
కాంతిచే విశ్వ మంతయుఁ గాల్చుచుంటి.

**తాత్పర్యము :-** విష్ణో ! మండుచున్న నీ ముఖములచే సమస్త లోకములను మ్రింగుచున్నవాఁడవై రుచి చూచుచున్నావు. తీక్ష్ణమైన నీ ముఖకాంతులు ప్రపంచ మంతయు నిండి తపింపఁ జేయుచున్నవి.

శ్లో. ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద ।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31

తే.గీ. కడు భయంకర రూపంబుఁ గలిగినట్టి
నీ వెవండవొ తెలుపుము, నీ ప్రవృత్తి
నెఱుఁగ లేకుంటి నో యాదిపురుష నిన్ను
తెలియగోరితి నా నమస్సులను గొనుము.

**తాత్పర్యము :-** దేవతలలో శ్రేష్ఠుఁడవైన స్వామీ ! నీకు నమస్కరించు చున్నాను. నాపై దయఁజూపి తెలుపుము. నీ వెవ్వఁడవు ? ఈ భయంకర రూపమును దాల్చితి వేమి ? నీవేమి చేయ నెంచితివి ?

శ్రీ భగవా నువాచ :-

శ్లో. కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ 32

*తే.గీ.* *అనిన భగవాను డిట్లనె నర్జునునకు*
*లోక నాశము( జేయు కాలు(డను నేను,*
*ఇచట(గల జన సంహారమే ప్రవృత్తి,*
*నీవు వలదనుకొన్నను నిశ్చయముగ*
*చత్తు రీయోధు లందఱు సవ్యసాచి !*

**తాత్పర్యము :-** లోకముల నన్నిటిని లయ మొనర్పుటకై చెలరేగిన కాలమును నేను. ఇప్పుడు లోక సంహార కార్యమునకు( బూనుకొనియున్నాను. శత్రు సేనలలోని యుద్ధవీరు లందఱు నీవు యుద్ధము చేయక మానివేసినను సరే తప్పక నశించిపోదురు.

**శ్లో.** **తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ**
**జిత్వా శత్రూన్ భుంక్ష్వరాజ్యం సమృద్ధమ్ ।**
**మయైవైతే విహతాః పూర్వ మేవ**
**నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ !** **33**

*తే.గీ.* *లెమ్ము యుద్ధ మ్మొనర్చి యశమ్ము( గొమ్ము*
*అనుభవింపుము రాజ్య సౌఖ్యముల నెల్ల*
*పార్థ ! నాచేత( జచ్చినవారె వీరు*
*ఇట నిమిత్త మాత్రమ్మె నీ వెంచి చూడ.*

**తాత్పర్యము :-** కాబట్టి లెమ్ము అర్జునా ! శత్రువులను జయించి కీర్తి సంపాదించుకొనుము. దానితో(బాటుగా రాజ్యసుఖము లన్నియు అనుభవించుము. ఈ శత్రురా(జు లందఱు ఇంతకుముందే నాచేత( జంపబడియున్నారు. నీవు నిమిత్తమాత్రు(డవుగా నిలువుము.

**శ్లో.** **ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ**
**కర్ణం తథాఽన్యా నపి యోధవీరాన్ ।**
**మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా**
**యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥** **34**

తే.గీ. ద్రోణ భీష్మ జయద్రథ దోర్బలులును
　　కర్ణుడును తక్కు(గల యట్టి కదన శూరు
　　లందఱును జంపు, భయపడ కాజిలోన
　　తప్పక జయింతు వీవు శాత్రవుల నిజము.

**తాత్పర్యము :-** భీష్మ ద్రోణులును, కర్ణుడు, జయద్రథుడు, ఇతర శత్రువీరులు ఇంతకుముందే నాచే చంపబడియున్నారు. నీవు నిమిత్త మాత్రముగా వారిని చంపుము. ఏ మాత్రము భయపడకుము. తప్పక యుద్ధము చేయుము. యుద్ధములో శత్రువులను జయించిన కీర్తి నీకు కలుగును. లెమ్ము.

సంజయ ఉవాచ :-

**శ్లో. ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య**
**కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ ।**
**నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం**
**సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥　　35**

తే.గీ. అనిన కేశవు( జూచి యత్యంత భీతి
　　వణకుచును ముకుళితపాణి పద్మములతో
　　గద్గదంబైన కంఠంబు గ్రాలుచుండ
　　పలికె నీ రీతిగా శ్వేతవాహనుండు.

**తాత్పర్యము :-** శ్రీ కృష్ణుడు తన కభయ మిచ్చుచు పలికిన పలుకులను విని అర్జునుడు కంపించుచు చేతులు జోడించి నమస్కరించి, మరల భయకంపితుడై ప్రణామము చేసి కంపించుచున్న కంఠముతో శ్రీ కృష్ణునితో నిట్లు పలుకుచున్నాడు.

అర్జున ఉవాచ :-

**శ్లో. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా**
**జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।**
**రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి**
**సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥　　36**

తే.గీ. నిన్ను కొనియాడి యీ జగం బన్నివిధుల
సంతసించుచు సద్భక్తి నలువుచుండె
రక్కసులు పాఱుచున్నారు దిక్కులకును
సిద్ధు లెల్ల నమస్కారముల్ సేయఁ గృష్ణ !

**తాత్పర్యము :–** ఓ కృష్ణా ! నీ మహిమచే ప్రపంచ మంతయు నెంతో సంతోషించుచున్నది. నీ పట్ల అనురాగముతో ఉన్నది. రాక్షసులు భయముతో దిక్కులకు పరుగెత్తి పోవుచున్నారు. సిద్ధు లందఱు నమస్కరించుచున్నారు.

**శ్లో. కస్మాచ్చ తే న నమేర న్మహాత్మన్**
**గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।**
**అనన్త దేవేశ జగన్నివాస**
**త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥** 37

తే.గీ. బ్రహ్మ కాది కారణ పరబ్రహ్మ వగుదు
వు సదసత్తత్పరుండవు పురుషవర్య !
జగతి నెన్నఁగ నవినాశ శక్తివీవు
కాన మ్రొక్కరె నీకు జగన్నివాస !
దేవదేవేశ ! పరమేశ ! దీనరక్ష !

**తాత్పర్యము :–** ఓ అనంతా ! దేవదేవ ! జగన్నివాస ! బ్రహ్మకు కూడ ఆదికారణమైన పరబ్రహ్మవు నీవు. అవ్యయుడవు, జగమంతయు నిండి యుండు సత్-అసత్ స్వరూపుడివి. అక్షర రూపుడివి. పరబ్రహ్మము నీవే. అటువంటి నీకు వారందఱు ఏల నమస్కరింపరు.

**శ్లో. త్వ మాదిదేవః పురుషః పురాణ**
**స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ**
**త్వయా తతం విశ్వ మనన్తరూప ! ॥** 38

తే.గీ. ఆదిదేవ ! పరంధామ ! అఖిల జన శ
రణ్య ! విశ్వ విశ్వంభరా ! ప్రణుతరూప !
అవ్యయానంత ! దివ్య ! సర్వాంతరాత్మ !
వర పురాణ పురుషుఁ డీవు భవ్యుఁ డీవు !

**తాత్పర్యము :-** ఓ మహాత్మా ! నీవు ఆది దేవుఁడవు. పురాణ పురుషుఁడవు. కనులకు కానవచ్చు ఈ ప్రపంచ మంతయు నీవే. సర్వశ్రేష్ఠమైన ఆధారము నీవే. తెలిసికొనఁదగినది-తెలియఁబడువాఁడవు నీవే. ఈ ప్రపంచ మంతయు నీవే వ్యాపించియున్నావు.

**శ్లో. వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః**
**ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ ।**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః**
**పున శ్చ భూయోఽపి నమో నమస్తే ॥** 39

*తే.గీ. వాయువును నీవె యముఁడును వహ్ని వీవె*
*వరుణుఁడును చంద్రుఁడున్ ప్రజాపతియు నీవె*
*మఱియు నెన్నంగను ప్రపితామహుఁడ వీవె*
*వందనము నీకు శతకోటి వందనములు.*

**తాత్పర్యము :-** వాయువు, యముఁడు, అగ్ని, చంద్రుఁడు, వరుణుఁడు నీవే. కశ్యపాది ప్రజాపతులు, పితామహుఁడైన బ్రహ్మకు తండ్రియైన పరమాత్మవు నీవే. నీకు వేలకొలది నమస్కారములు. మఱల మఱల ప్రణామములు అర్పించుచున్నాను.

**శ్లో. నమః పురస్తా దథ పృష్ఠత స్తే**
**నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**
**అనన్తవీర్యామితవిక్రమ స్త్వం**
**సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥** 40

*తే.గీ. ఇందుగల వందులేదని యెంచ నగునె*
*అంతటను నిండియున్న యనంతశక్తి -*
*ధరుఁడవు నమితమౌ శౌర్యధనుఁడ వీవు*
*అందుచే నీకు మ్రొక్కెద నన్ని యెడల.*

**తాత్పర్యము :-** సర్వ దిశలయందును, అంతటను వ్యాపించియున్న నీకు అన్ని దిక్కులలోను నమస్కరించుచున్నాను. అనంతమైన పరాక్రమము,

సామర్థ్యము( గల్గి సర్వ ప్రపంచమును ఆక్రమించియున్నావు. ఆ కారణమువలన నీవు సర్వస్వరూపు(డవు.

**శ్లో. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం**
**హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి।**
**అజానతా మహిమానం తవేదం**
**మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి॥** 41

*తే.గీ. ఇట్టి నీదగు మహిమంబు నెఱుగకుండ*
*చనవుననొ ప్రమాదముననొ సఖుఁడ! హితుఁడ!*
*యాదవా! కృష్ణ! యని నిన్ను నజ్ఞ డగుచు*
*పిలిచితిని నన్ను మన్నించవలయు తండ్రి!*

**తాత్పర్యము :-** కృష్ణా! నీ ఘన మహిమను తెలిసికొనలేక చనువుచేత( గాని, అజ్ఞానముచేత(గాని, తొందరపాటుతో నిన్ను నా సమాన వయస్కునిగా( దలంచి 'ఓ యాదవా! ఓ కృష్ణా!' అని ఏమేమో పలికినాను. వాని కన్నింటికిని నీవు నన్ను మన్నించవలెను సుమా!

**శ్లో. యచ్చావహాసార్థ మసత్కృతోఽసి**
**విహార శయ్యాసన భోజనేషు।**
**ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం**
**తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్॥** 42

*తే.గీ. అచ్యుతా! అప్రమేయా! మహానుభావ!*
*శయన భోజన విహరణాసనములందు*
*ఎదుటనే గాని పదిమంది యెదటఁగాని*
*నే నొనర్చిన గేలి మన్నించు తండ్రి!*

**తాత్పర్యము :-** కృష్ణా! అప్రమేయుఁడవైన నిన్ను తెలిసికొనకుండ ఆటలాడుకొను సమయములలోను, నిద్రించు వేళలలోను, భుజించెడి సమయాలలోను నీ ప్రత్యక్షములోగాని లేక, పరోక్షములో( గాని నిన్ను పరిహాసము చేసినదానికి నీవు నన్ను క్షమించవలెను.

**శ్లో. పితాఽసి లోకస్య చరాచరస్య**
**త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్ ।**
**న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో**
**లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావః ॥ 43**

*తే.గీ. అప్రతిముఁడైన నీవె చరాచరాత్మ*
*జగములకు నెల్ల పూజ్యుఁడౌ జనకుఁ డౌదు*
*శ్రేష్ఠగురుఁడవునై నీవు వెలుఁగు కతన*
*సాటిలేరయ్య నీకు ముజ్జగములందు.*

**తాత్పర్యము :–** ఓ మహానుభావా ! నీ ప్రభావమునకు సాటి ఎక్కడను లేదు. చరాచరమైన ఈ ప్రాణికోటికి నీవు తండ్రివి. పూజనీయుఁడవు. నీవే గురుఁడవు. ముల్లోకములలోను నీకు సమానుఁడు లేదు. ఇక నీకంటె అధికుఁ డే విధముగా నుండును ?

**శ్లో. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః**
**ప్రియః ప్రియా యార్హసి దేవ ! సోఢుమ్ ॥ 44**

*తే.గీ. భువిని సాష్టాంగముగ వ్రాలి మ్రొక్కు లిడెద*
*ప్రియుఁడు ప్రియురాలి, స్నేహితుఁ బ్రియసఖుండు*
*తండ్రి పుత్రుని మన్నించి తనుపు నట్లు*
*కరుణతో నన్ను రక్షించు పరమపురుష !*

**తాత్పర్యము :–** ఓ కృష్ణా ! జగన్నియామకుఁడవైన నీ పాద పద్మములపై సాష్టాంగపడి ప్రార్థించుచున్నాను. ఓ దేవా ! పుత్రుఁడు చేసిన తప్పును తండ్రి క్షమించినట్లుగా, మిత్రుని అపరాధమును మిత్రుఁడు మన్నించినట్లుగా, ప్రియురాలి తప్పిదమును ప్రియుఁడు క్షమించినట్లుగా నా తప్పిదమును నీవు క్షమించవలయునని వేడుకొనుచున్నాను.

**శ్లో. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా**
**భయేన చ ప్రవ్యథితం మనో మే ।**
***తదేవ మే దర్శయ దేవ ! రూపం**
**ప్రసీద దేవేశ ! జగన్నివాస ॥**

*తే.గీ. మునుపుఁ జూడని నీ రూపుఁ గనఁగ నాకు*
*సంతసము గల్గె మది భీతి చాల వణకె*
*చూడఁ జాలను పరమాత్మ ! వేడుకొందు*
*తొల్లి రూపమె చూపుము తోయజాక్ష !*

**తాత్పర్యము :–** దేవా ! ఇదివఱ కెన్నడును చూడబడని నీ రూపమ జూచి నేను మిక్కిలి సంతోషించితిని. అయినను నా మనస్సు భయమ సంక్షోభించుచున్నది. హే జగన్నివాస ! అనుగ్రహించి నీ పూర్వ రూపః నాకు చూపుము.

**శ్లో. కిరీటినం గదినం చక్రహస్తం**
**ఇచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ ।**
**తేనైవ రూపేణ చతుర్భుజేన**
**సహస్రబాహో ! భవ విశ్వమూర్తే !**

*తే.గీ. వేయి భుజములతో వెల్గు విశ్వరూప !*
*చూడఁ జాల నీ రూపంబు, చూపు తండ్రి !*
*రమ్య మకుటమ్ముఁ గదయు చక్రమ్ముఁ దాల్చి*
*భువి చతుర్భుజ రూపంబు పూర్వ మట్లె.*

**తాత్పర్యము :–** ఓ విశ్వరూపా ! సహస్ర బాహువులతోఁ బ్రకాశిం నీ రూపముకంటె వసుదేవుని కుమారుఁడవై కిరీటము, గద, చక్రము ధరి నాలుగు భుజములతోఁ బ్రకాశించెడి నీ స్వరూపమునే నాకు చూపుము. భయంకర రూపమును ఉపసంహరించుకొనుము.

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. మయా ప్రసన్నేన తవార్జునేదం**
**రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।**
**తేజోమయం విశ్వ మనన్త మాద్యం**
**యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥** **47**

*తే.గీ. అనిన పరమాత్మ యిట్లనె నర్జునునకు -*
*మెచ్చితిని దివ్య నేత్రంబు లిచ్చినాను*
*ఆద్యము ననంతమై యొప్పునట్టి నాదు*
*రూప మిది యోగమహిమచే జూపినాను*
*వరలగా నీకె-కనలేరు పరులు దీని.*

**తాత్పర్యము :-** అర్జునా ! నిన్ను మెచ్చి ఇతరు లెవ్వరును చూచుటకు వీలుకానట్టి, ప్రకాశమానమైన, వింతకాంతిచే ప్రకాశించెడి అనంతమైన ఈ విశ్వరూపమును నా యోగమహిమచే నీకు ప్రదర్శించితిని.

**శ్లో. న వేద యజ్ఞాధ్యయ నై ర్న దానైః**
**న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః ।**
**ఏవంరూప శ్శక్య అహం నృలోకే**
**ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర ॥** **48**

*తే.గీ. తపము యజ్ఞము దాన మధ్యయనములను*
*వేద విద్యల వలనను వినుత శ్రౌత*
*స్మార్త కర్మల వలనను మానవులకు*
*కానుపింపను కురువీర ! కదనధీర !*

**తాత్పర్యము :-** ఓ కురువీరా ! వేదాధ్యయనము, యజ్ఞము, దానములు, శ్రౌతస్మార్త కర్మలు చేసినవారికిగాని, ఉగ్రతపస్సు చేసినవారికిగాని చూడ సాధ్యము కాని నారూపమును నీకు మాత్రమే చూపితిని.

శ్లో. మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య ॥ 49

*తే.గీ. కడు భయంకర మీ రూపు గాంచి భీతి*
*పొందఁ బోకుము మూఢత్వమును వదలుము*
*ప్రియముతో నిర్భయుండవై పేర్మినాదు*
*సహజ రూపంబుఁ గను మింక సవ్యసాచి !*

**తాత్పర్యము :-** అర్జునా ! భయంకరము, ప్రళయకాల సదృశమునైన నా ఈ విశ్వరూపమునుఁ జూచినందువలన నీకుఁ గల్గిన భయము, విమూఢ భావము తొలఁగి, నీవు కోరిన వాసుదేవ రూపమే నీకు సాక్షాత్కరింపఁబడు చున్నది; చూడుము.

*సంజయ ఉవాచ :-*

శ్లో. ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా ॥ 50

*తే.గీ. అనెను శ్రీకృష్ణుఁ డప్పుఁ డర్జునున కనుచుఁ*
*దనర ధృతరాష్ట్రుఁ జూచి వందనము చేసి*
*సంజయుఁడు చెప్పె - కురురాజ ! సరసిజాక్షుఁ*
*డైన శ్రీ వాసుదేవుఁ డర్జునుని భీతి*
*తొలఁగ తన సౌమ్య రూపంబుతోడ నిల్చి*
*పరగ నోదార్చె - విజయుని భాగ్య మేమి !*

**తాత్పర్యము :-** సంజయుఁడు ధృతరాష్ట్రునితో ఇట్లు వివరించుచున్నాడు. వాసుదేవుఁడు తన నిజ స్వరూపమును దాల్చి అర్జునునకు భయముఁగొల్పిన రూపమును మాని సౌమ్యమైన శ్రీ కృష్ణరూపముచే అతనికి సంతోషమును గలిగించినాడు.

అర్జున ఉవాచ :-

**శ్లో. దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన !**
**ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః ॥ 51**

*తే.గీ. అంతటన్ గృష్ణు వరమానుషాకృతిఁ గని*
*తగ ధనంజయుఁ డిట్లనె - ధరణినాథ !*
*భయము దొలఁగె జనార్దనా ! ప్రాకృతమతి*
*సుప్రసన్న మనస్సుతోఁ జూచుచుంటి*
*ధన్యుఁడను నేను మాధవా ! ధన్యుఁ డైతి.*

**తాత్పర్యము :-** శ్రీకృష్ణుని సౌమ్యరూపమును జూచి అర్జునుఁ డిట్లను చున్నాడు. "ఓ కృష్ణా ! సౌమ్యమైన నీ మానుషరూపము చూచిన పిమ్మట నాకు భయము పోయినది. బుద్ధికి తెలివి తేటలు గలిగినవి. నాకు సహజమైన స్వభావము ఇప్పుడు కలిగినది."

శ్రీ భగవా నువాచ :-

**శ్లో. సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ ।**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః ॥ 52**

*తే.గీ. అనిన యర్జునుఁ గని కృష్ణుఁ డనియె, పార్థ !*
*నీవు గాంచిన నా రూపు నిశ్చయముగఁ*
*గాంచఁగా దుర్లభము దేవగణముఁ గూడ*
*నిత్యదర్శన కాంక్షతో నిలిచియుండు.*

**తాత్పర్యము :-** అనగా కృష్ణపరమాత్మ ఇట్లన్నాడు : 'ఓ ఫల్గునా ! నీవు చూచిన నా యీ విశ్వరూపమును జూడఁగల్గుట దుర్లభము. దేవత లీ రూపమును చూడవలెనని ఎల్లప్పుడు కోరుకొనుచుందురు.

**విశేషార్థము :-** దేవతలు భగవానుని విశ్వరూపమును చూడవలెనని కోరుకొనుచుందురే తప్ప వారికి ప్రయాస మాత్రమే మిగిలినది. వారికి ప్రయాస తప్ప అది ఫలింపలేదని విశేషాంశము.

**శ్లో. నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవంవిధో(ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥ 53**

*తే.గీ. ఎట్టిదౌ రూప మొప్ప నన్నిపుడు నీవు*
*కాంచ గలిగితొ యా రూపు గలుగు నన్ను*
*వేద విద్యాధ్యయన యజ్ఞ విధుల గాని*
*తపములను గాని చూడంగ దరము గాదు.*

**తాత్పర్యము :-** నీవు కన్నులార చూచిన విశ్వరూపముచేత ప్రకాశించు నన్ను చూచుట సాధ్యము కాదు. వేదాధ్యయనముచేత గాని, చాంద్రాయణాది వ్రతములచేతగాని గో భూ హిరణ్యాది దానములచేతగాని ఎవ్వరును నా యీ విశ్వరూపమును గాంచలేరు.

**శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున !**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ! 54**

*తే.గీ. అర్థమేకాని నా రూప మవని దెలిపి*
*కనుగొనంగను పొందంగ గలుగుటకును*
*భవ్యమార్గము నిశ్చలభక్తి యొకటె*
*అని యెఱుంగుము శ్వేతవాహన ! కిరీటి !*

**తాత్పర్యము :-** అర్జునా ! ఈ ప్రకారమైన నా యీ రూపము దెలిసికొనుటకు, చూచుటకు యథార్థముగా పొందుటకు ఏకాగ్రమై అన్యాసక్తముకాని అచంచలమైన భక్తి యొక్కటే ముఖ్యసాధనము సుమా !

**విశేషార్థము :-** అనన్యమైన భక్తిచే భగవద్దర్శనము సాధ్యమని చెప్పబడు చున్నది. అట్లని వేదాదులు వ్యర్థములని కాదు. భక్తిప్రధానములైన వేదాధ్యయనాదులు ఉత్తమగతికి సాధనములని కూడ గ్రహించవలెను.

**శ్లో. మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః ।**
**నిర్వైర స్సర్వ భూతేషు య స్స మా మేతి పాణ్డవ ! 55**

తే.గీ. నాకు ప్రియమైన పనులె యెన్నడును జేసి
నన్నె పరమ సంప్రాప్యమం చెన్ని, సకల
బంధములు వీడి భువి నెల్ల ప్రాణులందు
ప్రియము గలవాడె నను జేరు విజయ ! నిజము.

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఏ భక్తుడు సత్కార్యములను నా ప్రీతికొఱకు కావించునో, నేనే పరమగతి యని నమ్ముకొని, అన్ని సంసారబంధములను వదలి, అన్ని ప్రాణులపట్ల సమానభావమును జూపునో అట్టి ఉత్తముడు నన్నే పొందుచున్నాడు.

**విశేషార్థము :-** భగవత్ప్రాప్తికి అనన్యభక్తియే ముక్తిసాధన మని విశేషాంశము.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
విశ్వరూప సందర్శన యోగంబను
పదునొకండవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'



శ్లో. సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః ॥ (12-18)

మిత్రునియందు, శత్రువునందు, మానావమానముల యందు, శీతోష్ణములయందు, నిందాస్తుతులయందును గూడ ఒకే రీతిగా మెలగువాఁడు, విషయాసక్తి లేక అల్ప సంతోషి, స్థిర నివాసము లేనివాఁడు, పరమార్థ విషయములో మాత్రము స్థిరచిత్తము కలవాఁడు అగు భక్తుఁడు నాకు ఇష్టుఁడు సుమా !



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం ద్వాదశోఽధ్యాయః

## భక్తి యోగము

*అర్జున ఉవాచ :-*

**శ్లో. ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే ।**
**యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥** 1

*తే.గీ. అనిని శ్రీకృష్ణు గని పార్థు డనియె నిట్లు -*
*నిత్యము మనస్సు నీయందె నిలిపి భక్తి*
*ధ్యాన మొనరించువారో ? కాదేని తండ్రి !*
*శాశ్వతుడవై యగోచర శక్తి నొప్పు*
*నిన్నుపాసన జేసెడి నియమవ్రతులొ ?*
*వీరిలో యోగ మెఱిగినవార లెవరు ?*

**తాత్పర్యము :-** అర్జునుడు శ్రీ కృష్ణునితో ఇట్లు అనుచున్నాడు: నీచే చెప్పబడినట్లుగా అనన్యభక్తితో ఎల్లవేళల నిన్నే ఉపాసించు భక్తులు; అట్లే ఇంద్రియ గోచరము కాని అక్షర పరబ్రహ్మను ధ్యానించువారు-ఈ ఇరు వర్గాలలో యోగమును బాగుగా తెలిసినవా రెవరు ?

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।**
**శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥** 2

తే.గీ. అనిని పార్థుని గని కృష్ణు డనియె నిట్లు -
నిత్యము మనస్సు నాయందె నిలిపి మిగుల
శ్రద్ధతోడుత నను నుపాసనము సేయు
భక్తులగు వారె భువిలోన పరమయోగు
లని యెఱుంగుము కౌంతేయ ! వినుతశీల !

**తాత్పర్యము :-** నాయందే మనసు నిలిపి నిరంతర దైవచింతనాప మిక్కిలి శ్రద్ధతోఁ గూడుకొన్నవారై ఎవరు నన్ను ఉపాసించుచున్నారో ఉత్తమయోగులు.

**శ్లో. యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్ ॥**

**సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।**
**తే ప్రాప్నువన్తి మా మేవ సర్వభూతహితే రతాః ॥**

తే.గీ. అక్షరుఁడ ననిర్దేశ్యుఁడ నవ్యయుఁడను
కడక నవ్యక్తుడను నచింత్యుఁడను నేను
నిర్వికారుఁడ నచలుఁడ నిత్యుఁ డేను
అగుటచే - నింద్రియంబుల నణచి సర్వ
కాలములయందు సమబుద్ధిఁగలిగి సకల
భూతజాలమున్ సంప్రీతి పొదలఁ జూచు
నట్టివారలె నను బొందునట్టి శక్తి
గలిగి వరలెదు భక్తులు కౌరవేంద్ర !

**తాత్పర్యము :-** ఎవరు ఇంద్రియము లన్నిటిని బాగుగా నిగ్రహి సమభావముతోఁ గూడినవారై, పరోపకారభావనాసక్తులై, ఇంద్రియము అగోచరము, నిర్వికారము, అచలము, నిత్యము సర్వవ్యాపి అం పరబ్రహ్మమును ధ్యానించుచున్నారో వారు నన్నే పొందుదురు.

**శ్లో. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్ ।**
**అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥**

తే.గీ. నిర్గుణోపాసనమునందు నియతముగను
మనసు నిలువదు దేహాభిమానులకును
తనర నక్షర బ్రహ్మమునందు మనసు
నిలువు టతికష్టమౌ పార్థ ! నిశ్చయముగ.

**తాత్పర్యము :-** నిర్గుణ పరబ్రహ్మముపట్ల ఆసక్తిగల మనస్సుగలవారికి ప్రయాస చాల అధికముగ నుండును. ఏల ననగా నిర్గుణోపాసనామార్గము దేహాభిమానముఁగల వారిచేత అతికష్టముగా పొందఁబడుచున్నది.

**శ్లో. యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ 6**
**తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ 7**

తే.గీ. సకల కర్మల ఫలము లొసంగి నాకె
చిత్తమును నిల్పి నాయందె చింతలేక
నన్నుపాసించి ధ్యానించుచున్న వారి
మరణ కారణ సంసార దురిత దుఃఖ
సాగరమునుండి దాటింతు సత్వరముగ.

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఎవరు సమస్త కర్మములను నాయందే సమర్పించి, నన్నే పరమగతిగఁ దలంచి, అనన్యచిత్తముతో నన్నే ధ్యానించుచు ఉపాసించుచున్నారో, నాయందే మనసు నిల్పిన అట్టివారిని మృత్యురూపమైన ఈ సంసార సముద్రమునుండి నేను శీఘ్రముగ బాగుగ లేవదీయుచున్నాను సుమా !

**శ్లో. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8**

తే.గీ. మనసు నెప్పుడు నాయందె యునిచి మేల్మి
నిశ్చలంబుగ బుద్ధిని నిలిపి నన్నె
నిరతమును ధ్యాన మొనరించి వరలు దేని
నీవు నాయందె నివసింతు నిశ్చయముగ.

**తాత్పర్యము :-** నాయందే మనసును స్థిరముగా నిలుపుము. నాయందే బుద్ధిని ప్రవేశ పెట్టుము. అట్లొనర్చినయెడల నాయందే నివసింతువు. సందేహము లేదు.

**శ్లో. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ ! 9**

*తే.గీ. ఆ విధంబుగ మనసు నాయందు నిలువ*
*నలవి కాదేని విజయ ! యభ్యాస యోగ*
*మార్గమున నన్ను పొందంగ మానితముగ*
*యత్న మొనరింపు మయ్య వీరాధివీర !*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఒక వేళ ఆ ప్రకారముగా మనస్సు నాయందు స్థిరముగా నిలుపుటకు నీకు శక్తి లేనిచో అభ్యాసయోగముతో నన్ను పొందుటకు ప్రయత్నించుము.

**శ్లో. అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।**
**మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥ 10**

*తే.గీ. అట్టి యభ్యాస యోగంబునందు నీకు*
*తగు సమర్థత లేదేని దానికొఱకు*
*వెతలు పడఁబోకు నాదు సంప్రీతికొఱకుఁ*
*జేయు కర్మలఁ జేయుచు సిద్ధిఁ బొందు.*

**తాత్పర్యము :-** ఈ ధ్యానాభ్యాసము చేయుట కసమర్థుఁడవైనచో నా సేవాకార్యము లొనర్చుటయందే తత్పరుఁడవు కమ్ము. నాకు ప్రీతికరములగు కర్మ లాచరించుటవలనఁ గూడ సిద్ధి నొందెదవు.

**శ్లో. అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః ।**
**సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11**

తే.గీ. అట్లు( గాదేని నను( గూర్చినట్టి యోగ
మైన( జేయు మయ్యదియు( గాదేని యాత్మ
శుద్ధి సర్వ కర్మంబుల నురుచిరముగ
సలుపుచును తత్ఫలములు కృష్ణార్పణ మని
నాకె యొసగుము నీ కదే శ్రీకరమ్ము.

**తాత్పర్యము :–** ఒకవేళ అభ్యాసము చేయుటలోను నీవు అసమర్థుడ వైనచో నాకు సంబంధించిన కర్మలు (పనులు) చేయుటలోనే ఆసక్తి గలవాడవు కమ్ము. అట్లే నాకొఱకు కర్మలను చేయుచున్నను నీవు మోక్షసిద్ధిని పొందగలవు.

**శ్లో. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే ।**
**ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్ ॥** 12

తే.గీ. కాన నభ్యాసమునకంటె జ్ఞానమెంతొ
మేలు, దానికంటెను మఱి మేలు ధ్యాన,
మంతకంటెను కర్మసంభవ ఫలమ్ము
త్యాగ మొనరింప( గల్గు చిత్తప్రశాంతి.

**తాత్పర్యము :–** అభ్యాసముకంటె జ్ఞానము శ్రేష్ఠమైనది. జ్ఞానముకంటె ధ్యానము శ్రేష్ఠమగుచున్నది. ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠమైయున్నది. అట్టి కర్మఫల త్యాగమువలన శీఘ్రముగా చిత్తశాంతి లభించును.

**శ్లో. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥** 13
**సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః ॥** 14

తే.గీ. సకల భూతంబులందు ద్వేషంబు విడిచి
కరుణయును మిత్రభావంబు( గలిగియుండి
అహము విడిచియు నోరుపు నరసి పూని
సుఖము దుఃఖము సమములంచును దలంచి

*నిత్య సంతోషమున్ మనో నిగ్రహమును*
*దృఢతరమ్మైన జ్ఞాన మెంతే ఘటించి*
*బుద్ధియున్ మది నాయందె పొందుపరచి*
*వెలయు యోగి యెవండొ నాప్రియుఁ డతండె.*

**తాత్పర్యము :-** ప్రాణులన్నిటికి హితుడై దయఁగలిగి, మమతలేకుండ, సంతోషమును దుఃఖమును సమానముగా భావించుచు, ఓర్పు తృప్తి గలిగి, నిశ్చలచిత్తముతో అంతఃకరణమును భగవదర్పితము చేసిన భక్తుడు నాకు ప్రియుఁడు.

**శ్లో. యస్మా న్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చ యః ।**
**హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్స చ మే ప్రియః ॥ 15**

*తే.గీ. జగతిఁ గని భీతిఁ జెందక సాగు నెవఁడు*
*జగతికిన్ భయముఁ గలిగించం డెవండు*
*హర్ష రోషభయాదుల నరసి మనసు*
*వికృతిఁ జెందఁ డెవండు నా ప్రియుఁ డతండు.*

**తాత్పర్యము :-** తనవలన ఇతరు లెవ్వరికిని భయముఁ గలుగనీయకుండ, ఇతరు లెవ్వరిని జూచి తాను భయపడకుండ, సంతోషము, భయము, ఆగ్రహము, ఉద్రేకము మున్నగు గుణములచే వికారమును బొందని సన్న్యాసులుగ ఏ భక్తు లుందురో వారు నాకు మిక్కిలి ఇష్టులు.

**శ్లో. అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః ॥ 16**

*తే.గీ. దేనియందు నపేక్షలు లేని మదిని*
*శుచియు దక్షతఁ గలిగి ప్రస్తుతుల మనుచు*
*వ్యథ లడంచి యుదాసీన భావుఁ డగుచు*
*నవని నాడంబరత లేక నలరునట్టి*
*విజ్ఞుఁ డగు వాఁ డెవండొ నా ప్రియుఁ డతండె.*

**తాత్పర్యము :-** విషయ సంబంధమైన ఏ కోరిక లేకుండ, శుచియైన వాఁడు, సమర్థుఁడు, మిత్రులయందును విరోధులయందును సమానముగా నుండువాఁడు, భయము లేనివాఁడు, సకల కర్మలను త్యజించినవాఁడు నయిన భక్తుఁడు నాకు చాల ప్రీతిని కలిగించును.

**శ్లో. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి ।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః ॥ 17**

*తే.గీ. సంతసము లేక దుఃఖమ్ము చెంతరాక*
*కోరికలు లేక ద్వేషమ్ముఁ జేరనీక*
*తగ శుభాశుభ కర్మలఁ దగులకుండ*
*వెలయు భక్తు డెవండొ నా ప్రియుఁ డతండె.*

**తాత్పర్యము :-** ఎవరు తమకు ఇష్టమైనవి లభించిన సంతోషమును, లభింపకపోయిన ద్వేషమును చెందకయుందురో, విచారము నెఱుగక యుందురో, పాప పుణ్య ఫలములచే బాధ నొందని స్వభావముఁగలవారో అటువంటి భక్తులు నాకు మిక్కిలి ప్రియమైనవారు.

**శ్లో. సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః* ।**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః ॥ 18**
**తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।**
**అనికేతః స్థిరమతి ర్భక్తిమా న్మే ప్రియో నరః ॥ 19**

*తే.గీ. శత్రుఁ గనినను మఱియు సన్మిత్రుఁ గనిన*
*మాన్యమైనను మఱి యవమాన్యమైన*
*జగతి శీతంబునైన నుష్ణంబునైన*
*నింద గలిగిన సంస్తుతి నొందఁ గనిన*
*వెలయఁగ సమానమం చెంచి, కలిగినంతఁ*
*దృప్తిపడి, నియత నివాస దీక్షలేక*
*స్థిరమతిన్ బుద్ధి నాయందె చెలగఁ జేర్చి*
*వెలయు భక్తు డెవండొ నా ప్రియుఁ డతండె.*

---

* మానాపమానయోః – పాఠాంతరము

**తాత్పర్యము :-** మిత్రునియందు, శత్రువునందు, మానావమానముల యందు, శీతోష్ణములయందు, నిందాస్తుతులయందును గూడ ఒకే రీతిగా మెలగువాఁడు, విషయాసక్తి లేక అల్ప సంతోషి, స్థిర నివాసము లేనివాఁడు, పరమార్థ విషయములో మాత్రము స్థిరచిత్తము కలవాఁడు అగు భక్తుఁడు నాకు ఇష్టుఁడు సుమా !

**శ్లో. యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః ॥** 20

*తే.గీ. చెలగ నతిశ్రద్ధతోడ నే జెప్పినట్టి*
*ధర్మ సారామృతము దీని దప్పకుండ*
*నాచరించుచుఁ గోలుచు నలరునట్టి*
*విజ్ఞుఁడగు వాఁ డెవండో నా ప్రియుఁ డతండె.*

**తాత్పర్యము :-** ధర్మమనెడి అమృతానికి సారమైన నా యీ బోధను ఎవరు శ్రద్ధతో విని, నేనే పరమపదమని భావించి, నేను జెప్పిన విధముగ సేవింతురో అట్టి భక్తులే నాకెంతో ప్రియమును గలిగింతురు.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
**భక్తియోగంబను**
పంద్రెండవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'



శ్లో. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి ।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥ (13-20)

ఓ అర్జునా ! ప్రకృతిని, పురుషుని ఉభయులను 'ఆది' అనునది లేనివారినిగా తెలిసికొనుము. మనస్సు మొదలైనవాటి వికారములను, త్రిగుణములను ప్రకృతివలన గలిగినవిగా ఎఱుగుము.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం త్రయోదశోఽధ్యాయః

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

*అర్జున ఉవాచ :-*

**శ్లో. ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ।**
**ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ! 1**

*తే.గీ.. అనిని శ్రీకృష్ణుఁ గాంచి యర్జునుఁడు పలికె*
*ప్రకృతి యన నేద్ది ? పురుషుఁడన్ వాఁ డెవండు ?*
*తనర క్షేత్రం బదేద్ది ? క్షేత్రజ్ఞుఁ డెవఁడు ?*
*జ్ఞాన మెది ? జ్ఞేయ మెయ్యది ? సరసిజాక్ష !*
*తెలియఁ గోరితి కేశవ ! తెలుపు మయ్య.*

**తాత్పర్యము :-** ఓ కేశవా ! ప్రకృతి అనగా ఏమో, పురుషుఁడెవఁడో, క్షేత్ర మనఁగా ఏమిటో, క్షేత్రజ్ఞుఁడని ఎవరిని చెప్పెదరో, జ్ఞానము, జ్ఞేయము అని దేని నందురో నాకు వివరముగా తెలియఁజేయుము.

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. ఇదం శరీరం కౌన్తేయ ! క్షేత్ర మిత్యభిధీయతే।**
**ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 2**

*తే.గీ. అనిన కౌంతేయుఁ గని కృష్ణుఁ డనియె నిట్లు*
*ఈ శరీరమె క్షేత్రమౌ నిది యెఱింగి*
*నట్టివానినె క్షేత్రజ్ఞుఁ డని వచింత్రు*
*తత్త్వవిదులైన జ్ఞాను లుత్తములు పార్థ !*

**తాత్పర్యము :-** ఓ కౌంతేయా ! మనకు కనబడునట్టి ఈ దేహమును క్షేత్ర మందురు. ఈ శరీరమును స్వాభావికమైన లేక గురూపదేశమైన జ్ఞానమువలన దేహము తనకంటె వేఱయిన దని తెలిసికొనఁగలిగినవానిని 'క్షేత్రజ్ఞుఁడ'ని తత్త్వజ్ఞులు చెప్పుదురు.

**శ్లో. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత !**
**క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తజ్జ్ఞానం మతం మమ ॥** 3

*తే.గీ. సకలమౌ శరీరములఁ బ్రశస్తముగను*
*తనరుచుండెడి నట్టి క్షేత్రజ్ఞు డేనె*
*తరచి క్షేత్రము క్షేత్రజ్ఞు నరసి తెలుపు*
*దానినే జ్ఞాన మని నేను దలఁతు పార్థ !*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! అన్ని ప్రాణికోట్ల శరీరములలోను ఉండెడి క్షేత్రజ్ఞుఁడను నేనే సుమా ! క్షేత్ర-క్షేత్రజ్ఞులను గ్రహించఁగలిగెడి జ్ఞానమే నాకు ఇష్టమైన జ్ఞానము.

**శ్లో. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।**
**స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥** 4

తే.గీ. ఎంచ క్షేత్రం బదేది యదెట్టి దగును
తద్వికారము లెవి తదుత్పత్తి యేమి ?
వరల క్షేత్రజ్ఞుఁ డెవ్వఁ డవ్వాని శక్తి
ఎట్టిదో తెల్పెదను విను మీవు విజయ !

**తాత్పర్యము :-** అర్జునా ! క్షేత్రమును గురించి, దాని స్వభావమును గురించి, అది చెందెడి వికారములను గురించి, దాని ఉత్పత్తికిఁ గల కారణములను గూర్చి తెలిసిన తదుపరి, క్షేత్రజ్ఞుని గూర్చి, మఱియు ఆ క్షేత్రజ్ఞుని శక్తి ప్రభావమును గూర్చి సంగ్రహముగా నీకు తెలియఁజేయుదును.

**శ్లో. ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।**
**బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥ 5**

*తే.గీ. వరవసిష్ఠాది ఋషులచే బహువిధముల*
*వేదములచేత వేర్వేఱు విధములుగను*
*సంశయ విదూరముగ యుక్తి సంహితముగ*
*బ్రహ్మసూత్ర పదంబులఁ బలుకఁ బడిన*
*వరవిశేషము లివి శ్రద్ధ నెఱుగు మయ్య.*

**తాత్పర్యము :-** ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము ఋషులచే బహు విధములుగాఁ బలుకఁబడినది. ఇదియే వేదాలచే వేఱు వేఱు రీతులుగాఁ గీర్తింపఁబడినది. బ్రహ్మ సూత్రములు దీనినే యుక్తి యుక్తముగా, నిస్సంశయముగా వివరించియున్నవి.

**విశేషార్థము :-** ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము శ్రీకృష్ణుని స్వకపోలకల్పితము గాదు. శ్రుతి, స్మృతి, మీమాంసా శాస్త్రముల ప్రమాణముగాఁ గల విషయమును పరమాత్మ వివరించుచున్నాఁడు.

**శ్లో. మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ ।**
**ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియ గోచరాః ॥ 6**

**ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనా ధృతిః**
**ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ 7**

*తే.గీ. పంచభూతమ్ములున్ మూల ప్రకృతి బుద్ధి*
*జ్ఞాన కర్మేంద్రియములు మనస్సు మఱియు*
*శబ్దమున్ రూపరసగంధ స్పర్శములును*
*కన నహంకార మిచ్ఛ దుఃఖము సుఖమ్ము*
*ధృతియు ద్వేషము మఱియును తెలివియున్న*
*వీనియందున గలిగెడు వికృతు లెల్ల*
*క్షేత్ర మని చెప్పఁబడును సంక్షిప్తముగను.*

**తాత్పర్యము :-** పంచభూతములు (5), అహంకారము, బుద్ధి, మాయ -అని ఎనిమిది విధములైన ప్రకృతి, దానితోఁబాటు జ్ఞాన కర్మేంద్రియములు (5+5), మనస్సు శబ్దాది విషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, స్థూలములగు దేహేంద్రియములు, అంతఃకరణ చైతన్యము, ధైర్యము- ఇదంతయు వికారములతోఁ గూడిన క్షేత్రమని చెప్పుచుందురు.

**విశేషార్థము :-** 'అవ్యక్తము' అనగా ఈశ్వరమాయ. సాక్షి (జీవాత్మ)కి తెలియఁబడెడి అన్ని విషయములు కలిపి 'క్షేత్రము' అనఁబడును.

**శ్లో.** **అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥ 8**

**ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ 9**

**అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥ 10**

**మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।**
**వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥ 11**

**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।**
**ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥ 12**

*తే.గీ. ఆత్మ సంస్తుతి విడనాడి యవనిలోన*
*డంబ మెఱుఁగక ఋజు స్వభావంబుఁ గలిగి*
*సహనము నహింస స్థైర్య శౌచములు మఱియు*
*ఘనత గురుసేవ యాత్మ నిగ్రహముఁ గలిగి*
*విషయ సుఖములపై వాంఛ వీడియుంట*
*తగ నహంకార మదిలేక తనరుచుంట*
*జనన మరణ జరావ్యాధి జనిత దుఃఖ*
*దోషము లెఱుంగకుండ సంతుష్టినుంట*
*దేనియందును నాసక్తి బూనకుంట*

ఆలు బిడ్డలు మడులు గృహంబులందు
నెపుడు బంధమ్ము పడకుండ నిష్టమైన
మఱి యనిష్టమె కలిగిన మనసునందు
సమముగా నెంచి జీవింపఁ జాలుచుంట
అన్నిటికి నన్నె గతి యని యెన్నియుంట
ఆప దెట్టిది వచ్చినన్నైనఁ గాని
నిశ్చలంబగు భక్తి రాణించు చుంట
విజన మగుచోట నుండుట, సజనమైన
తావులందుండఁ గోరక తనరుచుంట
ఎందు నధ్యాత్మ సుజ్ఞానమందు మనసు
జారిపోనీక తత్త్వసుజ్ఞానమునను
కలుగు లాభంబు నెఱుఁగంగఁ గలుగు నదియె
జ్ఞాన మగు, నన్య మెల్ల నజ్ఞాన మగును.

**తాత్పర్యము :-** 8. ఆత్మస్తుతి లేకుండుట, గర్వము లేకపోవుట, సరళ స్వభావము, ఓర్పు, కుటిలత లేని నిర్మలమైన మనస్సు, మోక్షమును పొందవలెనను స్థిరమగు భావమును కలిగియుండవలెను.

9. శబ్దాది విషయములపట్ల వైరాగ్యభావము కలిగియుండుట, అహంకారము కొంచెముకూడ లేకపోవుట, పుట్టుట, గిట్టుట, ముసలితనము, దుఃఖము మున్నగువానిలోని దోషమును తెలిసికొని మనసును దేనితోను బంధింపఁబడకుండ (అసంగముగా) ఉంచుకొనుట ముఖ్యమైన కర్తవ్యము.

10. ఇల్లు, భార్య, పుత్రులు మున్నగు ప్రపంచ వ్యవహార విషయముల పట్ల ధ్యాసలేకుండుట, మనస్సులో విషయ సుఖములపట్ల ఆసక్తి లేకపోవుట సుఖసంతోషముల సమానభావమును కలిగియుండుట ముఖ్యమైనవి.

11. సంసారము ఏ మాత్రము లేని జ్ఞాన శూన్యులైన పామరుల సమూహములోఁ దిరుగకుండ ఉండుట, ఈశ్వరుఁడనైన నాయందు నిశ్చల భావముతో 'నన్నే గతి'యని నమ్ముకొనియుండుట, ఏకాంత ప్రదేశములో నన్ను కొలుచుట ముఖ్యముగా నున్నవి.

12. ఎల్లప్పుడు ఆత్మ సంబంధమైన జ్ఞానమును తెలిసికొనుటకు యత్నించుట, మోక్షమందే దృష్టి నుంచి జ్ఞానమును సంపాదించుట జ్ఞానసాధనము లని చెప్పబడుచున్నవి. పైన చెప్పిన వాటికంటె భిన్నములైన వన్నియు అజ్ఞాన మని చెప్పఁబడును.

**విశేషార్థము :–** పురుషార్థ సముపార్జనకు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ విజ్ఞానము ముఖ్యమని తెలిసి ఆ జ్ఞానమును పొందుటకు ఇరువది సాధనములు వివరింపఁబడినవి. ఈ గుణములను అలవఱచుకొన్నవాఁడు త్వరలో మోక్షమును పొందఁగలవాఁడు. లేనివాఁడు జనన మరణ రూపమైన సంసారములో ఓలలాడుచుండును. 'క్షేత్రము' - పొలము అనుకొనినచో 'క్షేత్రజ్ఞుడు' యజమాని అని అర్థము చేసికొనవలెను. దేహము వేఱు, జీవుడు వేఱు-అని అర్థము.

**శ్లో. జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే ।**
**అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాస దుచ్యతే ॥ 13**

*తే.గీ. ఏది జ్ఞేయమొ విను మోయి - యేది యెఱిఁగి*
*అమృతమను మోక్షసంపద నందుకొనునొ*
*ఆదిలేనిది నిరతిశయంబునైన*
*దరయ సదసత్పదార్థంబునైనఁ గాని*
*దేదొ యదె జ్ఞేయ మగు బ్రహ్మ మిదియె పార్థ !*

**తాత్పర్యము :–** దేనిని తెలిసికొనిన మోక్షము కలుగునో అటువంటి దానిని చెప్పుచున్నాను. ఉత్పత్తి యేదో తెలిసికొనలేని ఆ బ్రహ్మమే జ్ఞేయము. అదే 'సత్' అని, 'అసత్' అని కూడ చెప్పఁబడుచున్నది.

**విశేషార్థము :–** తప్పక తెలిసికొనవలసిన వస్తు వొకటి ఉన్నది. అది సదసద్విలక్షణము, ఉత్పత్తి రహితమైన పరబ్రహ్మము దానిని తెలిసికొనిన జనన మరణ రూపమైన సంసారమునుండి ముక్తి కలుగునని భావము.

**శ్లో. సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్ ।**
**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥ 14**

*తే.గీ. తితనర నంతట పాణి పాదమ్ము లొప్పి*
*కనులు శిరసులు మఱియు ముఖంబు లన్ని*
*యెడలనుం గల్గి కర్ణము లెల్ల యెడల*
*గలిగి యా బ్రహ్మ మది యొప్పు గదలకుండ.*

**తాత్పర్యము :-** అటువంటి బ్రహ్మవస్తువు లోకమంతట కాళ్ళు, చేతులు కల్గియుండి, అంతట నేత్రములు, చెవులు, శిరసు కల్గియుండి సర్వత్ర వ్యాపించియుండును.

**శ్లో. సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్ ।**
**అసక్తం సర్వభృ చ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ 15**

*తే.గీ. ఇంద్రియంబులు లేక సర్వేంద్రియముల*
*గుణములను ప్రకాశింపఁ జేయును కిరీటి !*
*దేని నంటక సర్వము దానె బూను*
*గుణముల ననుభవించు నిర్గుణియె యయ్యు.*

**తాత్పర్యము :-** జ్ఞానేంద్రియములయొక్కయు, కర్మేంద్రియముల యొక్కయు గుణములచే ప్రకాశించుచుండును. కాని, అది సర్వేంద్రియ వివర్జితము. దేనిని అంటకుండగనే సర్వమును భరించునట్టిది. త్రిగుణములతోఁ గూడి ఉండకయే ఆ గుణముల కార్యములైన సుఖ దుఃఖములకు, మోహమునకు సాక్షిగా ఉండును.

**శ్లో. బహి రన్తశ్చ భూతానా మచరం చర మేవ చ ।**
**సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ 16**

*తే.గీ. లలి చరాచర భూతజాలంబుయొక్క*
*వెలుపలను లోపలను నుండి వెలుఁగు నిద్ది*
*తనర జంగమ స్థావరాత్మకమునగుచు*
*సూక్ష్మమై కానఁబడకుండ చూడ్కులకును*
*అంది యందక నొప్పు బ్రహ్మంబు సుమ్ము.*

**తాత్పర్యము :-** అట్టి పరబ్రహ్మ స్వరూపము చరాచర రూపమైన ఈ ప్రపంచములో ప్రాణులన్నింటికి లోపల వెలుపల వ్యాపించియుండును. సూక్ష్మ రూపములో ఉండుటచేత అది కంటికి కనిపించదు. కేవలము పండితులకు మాత్రమే గోచర మగును. అజ్ఞానులు దాని స్వరూపమును తెలిసికొనఁజాలరు.

**శ్లో. అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్ ।**
**భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥** 17

*తే.గీ. అలర నవిభక్త మయ్యు భూతాళియందు*
*తగ విభక్త మట్లొప్పి భూతముల నెల్ల*
*పుట్టఁగాఁ జేసి పోషించి గిట్టఁ జేసి*
*పరగఁ బుట్టించు నత్పరబ్రహ్మ మిద్ది.*

**తాత్పర్యము :-** ఆ పరబ్రహ్మము సర్వభూతములలోను వ్యాపించి యుండి అంటనట్లుగా ఉండి, వేఱుగా ఉండి అభిన్నముగా తోచును. సృష్టి కాలములో అన్ని భూతములను సృష్టించుచు, స్థితికాలములో పెంచుచు, ప్రళయ కాలములో నశింపఁజేయు స్వభావముఁ గలదై యుండును. పరబ్రహ్మముయొక్క ఈ స్వరూపము తెలిసికొనదగినది.

**శ్లో. జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్ ॥** 18

*తే.గీ. జ్యోతు లన్నింటికిని పరంజ్యోతి యిద్ది*
*అంధకారంబు నావల నలరు నిద్ది*
*తెలియఁదగు పొందఁ దగు జ్ఞానబలమువలన*
*సకల జీవుల వెలుఁగు ప్రశస్త దివ్య*
*భాసురంబగు నత్పరబ్రహ్మ మిద్ది.*

**తాత్పర్యము :-** ఆ పరబ్రహ్మముయొక్క తేజస్సు జ్యోతులన్నిటికి జ్యోతి. జ్ఞానఫలముగాఁ జెప్పఁబడిన పరబ్రహ్మము. ఇరువది గుణములచే తెలియఁబడు జ్ఞానము. ఈ మూఁడును అన్ని ప్రాణుల హృదయములలోను తెలియఁబడును.

**ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।**
**మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥** 19

ి. క్షేత్రమున్ మఱి జ్ఞానమున్ జ్ఞేయములను
చెప్పితిని నేను నీకు సంక్షిప్తముగను
ఇది యెఱింగిన నా భక్తు డింపుమీర
నన్ను బొందంగ నర్హుఁడౌ నన్ని విధుల.

**తాత్పర్యము :-** అర్జునా ! ఈ ప్రకారముగా క్షేత్రము, అట్లే జ్ఞానము, యము( గూడ సంక్షేపముగా( జెప్పబడినవి. నా భక్తుడు వీని నెఱింగి క్షమును (నాలో ఐక్యమును) పొందుటకు అర్హు(డగుచున్నాడు.

**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి ।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥** 20

. ప్రకృతి పురుషు లనాదులన్ భావ మెఱ(గి
గుణ వికారము లరసి పేర్కొనగ ప్రకృతి
వలననే బుట్టినవి యని తెలిసికొనుము
దివ్య శస్త్రాస్త్రతేజ ! కుంతీ సుపుత్ర !

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ప్రకృతిని, పురుషుని ఉభయులను 'ఆది' నది లేనివారినిగా తెలిసికొనుము. మనస్సు మొదలైనవాటి వికారములను, ుణములను ప్రకృతివలన గలిగినవిగా ఎఱుగుము.

**కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।**
**పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥** 21

. ప్రకృతి యను నదె కార్య కారణములకును
హేతువని చెప్ప(గా( బడు నాతతముగ
సుఖము దుఃఖము ననుభవించుటకు పురుషు(
డరయ కారణ మని నీవు నెఱు(గు మోయి !

**తాత్పర్యము :-** కార్యకారణములను కలుగునట్లు చేయుటలో ప్రకృతియే హేతువని, సుఖదుఃఖములను అనుభవించుటలో పురుషుడే హేతువని చెప్పఁబడుచున్నది.

**శ్లో. పురుషః ప్రకృతిస్థో హి భుజ్క్తే ప్రకృతిజా న్గుణాన్ ।**
**కారణం గుణసఙ్గోఽస్య సదస ద్యోనిజన్మసు ॥** 22

*తే.గీ. ప్రకృతియందున నున్నట్టివాఁడు పురుషుఁ*
*డగుట ప్రకృతి సంబంధమైనట్టి గుణము*
*లనుభవించుచు నున్నాఁడు, తనరఁ నట్లు*
*ప్రకృతి గుణములయం దనురక్తు డగుట*
*జగతిఁ గను నుత్కృష్ట నికృష్ట జన్మములను.*

**తాత్పర్యము :-** ప్రకృతియందున్నవాఁడై పురుషుఁడు అనగా జీవుఁడు ప్రకృతివలన బుట్టిన సుఖదుఃఖాది గుణములను అనుభవించుచున్నాఁడు. ఆయా గుణములతోడి కూడికయే ఈ జీవునకు ఉత్తమ, అధమ జన్మము లెత్తుటకు హేతువై యున్నది.

**శ్లో. ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః ।**
**పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మి న్పురుషః పరః ॥** 23

*తే.గీ. పరమపురుషుఁడు దేహమం దిరవుకొనుచు*
*భర్తయై భోక్తయై మహేశ్వరుఁడునగుచు*
*జగతి ననుమోదకుం డౌచు సాక్షి యగుచు*
*పరగఁ బరమాత్ముఁ డని చెప్పఁబడును పార్థ !*

**తాత్పర్యము :-** పురుషుఁడు శరీరమందున్నప్పటికిని శరీరముకంటె వేరైన వాఁడును, సాక్షిభూతుఁడును, అనుమతించువాఁడును, భరించువాఁడును, అనుభవించువాఁడును, పరమేశ్వరుఁడును, పరమాత్మయు అని చెప్పఁబడు చున్నాఁడు.

**శ్లో. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥** 24

*తే.గీ. ప్రకృతి పురుషుల నిట్టు లెవ్వాఁ డెఱుంగు*
*పరగ నెందున్నఁ గాని యప్పురుషుఁ డెలమి*
*మరల జన్మంబు నొందఁ డుర్వారను విజయ !*
*ముక్తి జెందును బంధ విముక్తుఁ డగును.*

**తాత్పర్యము :-** ఎవ్వఁడు ఈ ప్రకారముగా పురుషుని (ఆత్మను) గుణములతోఁ గూడిన ప్రకృతిని తెలిసికొనుచున్నాఁడో అఁత డే విధముగా నున్నప్పటికిని మఱల జన్మింపఁడు.

**శ్లో. ధ్యానేనాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 25**

*తే.గీ. ఆత్మయందున పరమాత్మ నాత్మచేత*
*నెమ్మిఁ గొందఱు గాంత్రు ధ్యానమ్ముచేత*
*కర్మయోగానఁ గొందఱు గాంత్రు మఱియుఁ*
*గాంత్రు కొందఱు సాంఖ్యయోగాన పార్థ !*

**తాత్పర్యము :-** ఆత్మను కొందఱు శుద్ధమైన మనస్సుచే ధ్యానయోగము ద్వారా తనయందు సాక్షాత్కరించుకొనుచున్నారు. అట్లే కొందఱు సాంఖ్యయోగముతోను, మఱి కొందఱు కర్మయోగముతోను చూచు చున్నారు.

**శ్లో. అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 26**

*తే.గీ. ఈ విధంబుగ పరమాత్మ నెఱుఁగలేని*
*జనులు గురుజనుల యుపదేశములు పొంది*
*చేయుదు రుపాసనల నట్లు చేసి నట్టి*
*వారును జయింత్రు మృత్యువున్ పాండుపుత్ర !*

**తాత్పర్యము :-** ఓ పాండుకుమారా ! మఱికొందఱు పై విధముగాఁ దెలిసికొనఁజాలనివారై ఇతరులవలన విని ఉపాసించుచున్నారు. శ్రవణతత్పరులైన అట్టివారు గూడ మృత్యురూపమైన ఈ సంసారమును దాటుదురు సుమా !

శ్లో. యావ త్సఞ్జాయతే కిఞ్చి త్సత్త్వం స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ ! 2

తే.గీ. ధరణి స్థావరజంగమాత్మకము లైన
సకలవస్తు సమూహమ్ము సవ్యసాచి !
ప్రకృతి పురుషుల కలయికవలన బుట్టు
చున్నదని నీ వెఱుంగు మీ యుజ్జ్వలముగ.

**తాత్పర్యము :–** భరతవంశ శ్రేష్ఠుఁడవైన ఓ అర్జునా ! ఈ ప్రపంచము స్థావర జంగమాత్మకమైన పదార్థము ఏది పుట్టుచున్నదో అది యంతయు క్షేత్రక్షేత్రజ్ఞుల కూడికవలననే కలుగుచున్నదని తెలియుము.

శ్లో. సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 2

తే.గీ. సకల భూతములం దుండ జాలు వాని
భూతజాలము నశియించిపోయె నేని
నాశ మొందక వెల్గుచున్నట్టి వాని
వరలు పరమేశుఁ డనుచు భావంబునందుఁ
దలఁచువాఁడె పో సత్య సంద్రష్ట యౌను.

**తాత్పర్యము :–** అన్ని భూతములలోను సమముగా నుండుచు నశించినను సరే నశింపకుండ నిశ్చయముగా నుండు పరమాత్మను ఎ చూచుచున్నాఁడో, వాఁడే సమ్యగ్దర్శనముఁ గలిగినవాఁడు.

శ్లో. సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
న హిన స్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥

తే.గీ. సకల జీవులయందును సమముగాను
అలరువానిగఁ బరమేశుఁ దలఁచువాఁడు
చెలగఁ దనచేత తన్ను హింసించుకొనఁడు
కాన పరమపదమగు మోక్షమును బొందు.

**తాత్పర్యము :-** ఓ పార్థా ! సర్వభూతములపట్లను సమానముగా పరమేశ్వరుని జూచినవాఁడు తన్ను తనచే హింసించుకొనఁడు. ఆ కారణమువలన ఉత్కృష్టమైన ముక్తి ఫలమును పొందుచున్నాఁడు.

**శ్లో. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।**
**యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥ 30**

*తే.గీ. ప్రకృతిచేతనె సకల కర్మములు గలుగు*
*నేను దానికిఁ గర్తను గానటంచు*
*ఆత్మ నెవ్వఁడు భావించునట్టి వాఁడె*
*సురుచిరోన్నత సందర్శి సుకృతి యతఁడె.*

**తాత్పర్యము :-** కర్మ లన్నియు కూడ ప్రకృతివశముతోఁ గలుగుచున్నవి. కాని, తాను వానికి కర్తను గానని అన్నివిధముల నిర్వికార పరబ్రహ్మను ఎవడు తెలిసికొనుచున్నాఁడో ఆతఁడే నిజమైన ద్రష్ట అని యర్థము.

**శ్లో. యదా భూత పృథ గ్భావ మేకస్థ మనుపశ్యతి ।**
**తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా ॥ 31**

*తే.గీ. వివిధ భూత ప్రపంచంబు వెలయు నొక్క*
*దానియందున ననియును తనర నద్ది*
*ఆత్మవలననె విస్తారమైన దనియు*
*అరసి తెలిసినవాఁడు బ్రహ్మమును బొందు.*

**తాత్పర్యము :-** రకరకములైన భూతములను (ప్రాణులను) స్వస్వరూపమైన ఆత్మరూపమందున్న వానినిగాఁ దెలిసికొనువాఁడు సర్వ వ్యాపకమైన బ్రహ్మముయొక్క భావమును పొందుచున్నాఁడు.

**శ్లో. అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః ।**
**శరీరస్థోఽపి కౌన్తేయ ! న కరోతి న లిప్యతే ॥ 32**

తే.గీ. అవ్యయుం డయి నిర్గుణుఁడై యనాది
యైన పరమాత్మ ప్రాకృతమౌ శరీర
మందు నుండియు చేయ డెట్టిదియు కర్మ
కాన నే కర్మ ఫలముచేఁ గాని తాను
అంటుఁగాఁ బడ బోదు పార్థా ! గ్రహించు.

**తాత్పర్యము :–** పరమ పురుషుఁడు పరమాత్మ స్వరూపమున శరీర మందుండి కూడ, అవ్యయుఁడు, అనాది పురుషుఁడు, నిర్గుణుఁడు, నిర్వికారుఁడు – అగుటచే కర్మలను తాను చేయఁడు. వానివలన గలుఁగు దోషము లాతని నంటుకొనవు.

**శ్లో. యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే ।**
**సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ 33**

తే.గీ. ఆకసము సర్వగత మైన దయ్యు నద్ది
సూక్ష్మ మగుటచే నెద్దాని సోక నట్లు
సకల దేహాలలోన ప్రబళస్తముగను
నలరుచుండియు పరమాత్మ యంటకుండు.

**తాత్పర్యము :–** అంతట వ్యాపించియున్నప్పటికిని ఆకాశము సూక్ష్మ రూపములో నుండుటచేత దేనిని గూడ సోకదు. అట్లే పరమాత్మ కూడ అన్ని దేహములలో నున్నప్పటికిని శరీరమును అంటియుండదు.

**శ్లో. యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ! 34**

తే.గీ. సూర్యుఁ డొక్కఁడు మిగుల భాసురముగాఁగ
సకల లోకాలకున్ ప్రకాశములు నింపు
అటులె క్షేత్రజ్ఞుడౌ పరమాత్మ యొకఁడె
సకల దేహాలకున్ ప్రకాశం బొనర్చు.

**తాత్పర్యము :–** సూర్యుఁ డొక్కఁడే సకల జగముల నే విధముగా ప్రకాశింపఁజేయునో ఆ విధముగానే పరమాత్మ పరాపర ప్రకృతి ద్వంద్వముతోఁ గూడిన యీ శరీరమును ప్రకాశింపఁజేయును.

**విశేషార్థము :-** ఆత్మయొక్క ఏకత్వము అట్లే నిర్వికారత్వము ఇందు వివరింపఁబడినది.

**శ్లో.** **క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా ।**
**భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరమ్ ॥** 35

*తే.గీ.* *ప్రకృతి పురుషుల భేదమున్ స్పష్టముగను*
*భూత తతికి సంబంధించి పొలుచు ప్రకృతి*
*బంధములనుండి తొలఁగు నుపాయములను*
*జ్ఞాన దృష్టిని దెలియంగ సాగువారు*
*మోక్ష సామ్రాజ్యమును మేల్మి పొందఁగలరు.*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఈ విధముగా క్షేత్ర, క్షేత్రజ్ఞుల విభాగమును (ప్రకృతి పురుషులయొక్క లక్షణములను) ప్రకృతియొక్క మాయాశక్తి నుండి తప్పించుకొనఁగలుగు ఉపాయమును జ్ఞానదృష్టిచేఁ దెలిసికొనఁగలుగువారు ముక్తిని పొందుదురు.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగంబను
పదమూఁడవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'



శ్లో. బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ ॥ (14-27)

నాశనము లేనిది, వికార రహితము, శాశ్వతమునైన జ్ఞాన యోగముచే పొందదగిన ఆనందము నిత్యముగా గలిగినదియు నగు పరమాత్మకు ప్రత్యగాత్మనగు నేనే ఆధారమైయున్నాను.

ప్రత్యగాత్మనగు నాకును, పరమాత్మయగు బ్రహ్మమునకును భేదము లేదు.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం చతుర్దశోఽధ్యాయః

## గుణత్రయ విభాగ యోగము

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్ ।**
**యద్జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధి మితో గతాః ॥** 1

*తే.గీ. దేని నెఱుగుటచే మునుల్ దివ్యమైన*
*సర్వతోత్కృష్టమైనట్టి జ్ఞానసిద్ధి*
*నంద గలిగిరొ, జ్ఞానంబు లన్నిటికిని*
*శ్రేష్ఠమైనట్టి జ్ఞానంబు చెలగ నెదియొ*
*తెలిపెదను నేను వినుము కుంతీసుపుత్ర !*

**తాత్పర్యము :-** జ్ఞానములలో కెల్ల ఉత్తమమైన జ్ఞానమును మరల చెప్పుచున్నాను, వినుము. మును లందఱు ఈ జ్ఞానమును తెలిసికొని ఈ దేహమును విడచిన పిమ్మట ఉత్కృష్టమైన మోక్షమును పొందుదురు.

**శ్లో. ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః ।**
**సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥** 2

*తే.గీ. సర్వతోత్కృష్టమైన యీ జ్ఞానమునను*
*మత్సమాన స్థితిం బొంది మానితముగ*
*సృష్టి కాలమునను జన్మ, జెంద బోరు*
*ప్రళయ కాలమునందును వ్యథను పడరు.*

**తాత్పర్యము :-** నేను చెప్పఁబోవు జ్ఞానమును ఆశ్రయించి ఎంతోమంది నన్ను చేరుకొన్నారు. అట్టివారు సృష్టిలో మరల జన్మము నెత్తరు. ప్రళయ కాలములోఁ గూడ వారి కెట్టి వికారమును కలుగనే కలుగదు.

**శ్లో. మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్ ।**
**సమ్భవః సర్వభూతానాం తతో భవతి భారత ! 3**

*తే.గీ. వరలఁగా గొప్పదౌ మూల ప్రకృతి నాదు*
*భూత సృష్టికి కారణభూత మగును*
*అందు నా యంశ మిడ గానె యఖిల ప్రాణి*
*కోటి యుత్పత్తి జరుగు నిక్కువము గాఁగ.*

**తాత్పర్యము :-** త్రిగుణాత్మకమైన ప్రకృతి నా మాయా రూపము. ఈ సృష్టి యంతటకిని ప్రకృతియే కారణము. ఆ సృష్టి నంతను కలిగించు బ్రహ్మ పుట్టుకకు కారణమైన బీజమును ప్రకృతియందే యుంచుచున్నాను. ఆ విధముగా సమస్త ప్రాణులు కూడా ఉద్భవించుచున్నవి.

**శ్లో. సర్వయోనిషు కౌన్తేయ మూర్తయ స్సమ్భవన్తి యాః ।**
**తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా ॥ 4**

*తే.గీ. సకల యోనులయందును సంభవించు*
*పలువిధ శరీరములకును ప్రకృతి తల్లి*
*నేను బీజప్రదుండనై నెగడుచుంట*
*తండ్రి నౌదును నే నని తలఁచుకొనుము.*

**తాత్పర్యము :-** ఓ కౌంతేయ ! ప్రాణులకు (చరాచరములకు) అన్నిటికిని మాయాశక్తియైన ప్రకృతియే తల్లి. వాటికంతయు పుట్టుక నిచ్చు తండ్రిని నేను.

**శ్లో. సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥ 5**

తే.గీ. అవ్యయుండైన దేహస్థుడైన యాత్మ
నలర ప్రకృతి సంభవమైన యట్టి త్రిగుణ
ములగు సత్త్వ రజ స్తమంబు లవి చూచి
బలిమి బంధించుచున్నవి పాండుపుత్ర !

**తాత్పర్యము :-** త్రిగుణములు ప్రకృతి మాయవలన బుట్టుచున్నవి. శరీరములో అవ్యయమై యున్న ఆత్మను ఈ మూఁడు గుణములును బంధించి మఱల పుట్టుటకుఁ గారణము లగుచున్నవి.

**శ్లో. తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్ ।**
**సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ॥ 6**

తే.గీ. అందు సత్త్వము నిర్మలమైన దగుట
విమలమై యనామయమునై వెలయు దృశ్య
సుఖముతోఁగూడ లౌకిక సుఖముఁ గలిసి
తనర బంధించు దేహి నెంతయును పార్థ !

**తాత్పర్యము :-** వానిలో సత్త్వగుణము స్ఫటికమువలెఁ బ్రకాశించుచు ఉపద్రవములేనిదై ఆత్మకు విషయభూతమైన సుఖమును అంతఃకరణవృత్తి రూపమున జ్ఞానమును గలిగించి దేహిని అభిమానముతోఁ గూడుకొన్నవానినిగాఁ జేయుచున్నది.

**శ్లో. రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్ ।**
**త న్నిబధ్నాతి కౌన్తేయ ! కర్మసఙ్గేన దేహినమ్ ॥ 7**

తే.గీ. కలుగు నిలను నాశాపాశ కారణమున
తగ రజోగుణము తెలియఁ దగిన దెన్న
అవని రాగాత్మకం బయి యలరు నిద్ది
కర్మబంధాన జీవునిఁ గట్టివేయు.

**తాత్పర్యము :-** అర్జునా ! రజోగుణము అనురాగమును స్వరూపముగాఁ గలిగి పొందఁబడని విషయములపట్ల కోరికను, పొందిన వానియందు ప్రీతిని గలిగించుచున్నది. ఆ రజోగుణము దేహిని దృష్టాదృష్ట ఫలహేతువులైన కర్మల నాచరించుటలో బంధించివేయుచున్నది.

**శ్లో. తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్ ।**
**ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత ॥ 8**

*తే.గీ. కుత్సితాజ్ఞానమున తమోగుణము పుట్టి*
*సకల జీవుల మోహమన్ జలధి ముంచి*
*నెఱి ప్రమాదంబు నాలస్య నిద్రలందు*
*గట్టిగా నెంతొ బంధింపఁ గలుగు పార్థ !*

**తాత్పర్యము :–** తమోగుణము అజ్ఞానమువలన బుట్టి అన్ని ప్రాణులకు మోహమును గల్గించుచున్నది. ఆ తమోగుణమువలన బుద్ధి మాంద్యము, ప్రమాదము, నిద్ర, ఆలస్యము అనునవి కలిగి దేహిని కట్టివేయుచున్నవి.

**శ్లో. సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత !**
**జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సఞ్జయ త్యుత ॥ 9**

*తే.గీ. ఇంద్రియ సుఖాల సత్త్వమెంతే నొసంగు,*
*భోగముల ముంచి తేల్చు రజోగుణంబు,*
*మాన్య జ్ఞానముం గప్పి ప్రమాద మందు*
*ముంచును తమోగుణ మదెంత మూర్ఖ మకట !*

**తాత్పర్యము :–** ఓ పాండుపుత్ర ! సత్త్వగుణము దేహిని సౌఖ్యము నందును, రజోగుణము కర్మమునందును, తమోగుణము జ్ఞానమును గప్పివైచి కర్తవ్యమును మరపించు ప్రమాదమునందు బంధించుచున్నవి. ప్రకృతిలోనుండు సత్త్వరజస్తమము లను మూడు గుణముల పనులను వివరించుచున్నాను. తెలిసికొనుము.

**శ్లో. రజ స్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత !**
**రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా ॥ 10**

*తే.గీ. సత్త్వ మది హెచ్చఁగా రజస్తమము లడఁగు*
*తనర రజ మెచ్చ సత్త్వము తమము లడఁగు*
*తమము హెచ్చిన రజము సత్త్వమ్ము నడఁగు*
*దివ్య శస్త్రాస్త్రతేజ ! కుంతీకుమార !*

**తాత్పర్యము :-** అర్జునా ! సత్త్వగుణము వృద్ధినొందినచో రజస్తమో గుణము లడఁగియుండును. రజోగుణము వృద్ధియందున్న వేళలలో సత్త్వ తమో గుణములు తగ్గియుండును. తమోగుణము హెచ్చిన సమయములో సత్త్వ రజోగుణములు తగ్గియుండును.

**శ్లో. సర్వద్వారేషు దేహేఽస్మి న్ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత ॥** 11

*తే.గీ. ఎలమి నీ దేహ మందలి యెల్ల ద్వార*
*ములను జ్ఞాన ప్రకాశంబు పుట్టు నెపుడు*
*అపుడు సత్త్వమ్ము మిక్కిలి యతిశయించె*
*నని గ్రహింపంగ వలయు పార్థా ! నిజమ్ము.*

**తాత్పర్యము :-** ప్రాకృతమైన యీ శరీరమునందు అడ్డు లేకుండ అన్ని ద్వారముల (ఇంద్రియముల) యందును స్వచ్ఛమైన జ్ఞానము ఎప్పుడు ప్రకాశించుచుండునో అప్పుడు సత్త్వము వృద్ధియందున్నట్లు గ్రహింపవలెను.

**శ్లో. లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా ।**
**రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ !** 12

*తే.గీ. తెలియఁగ రజోగుణము వర్ధిల్లి నపుడు*
*లోభమును కామ్యకర్మలలోన ప్రీతి*
*ఆశయున్ మన శ్శాంతిలేనట్టి గుణము*
*అనున వెల్లను గలుగు నర్జున ! గ్రహించు.*

**తాత్పర్యము :-** అర్జునా ! రజోగుణము వృద్ధినొందిన సమయమున పరధనములయందు అపేక్ష, కామ్యకర్మల నాచరింపవలెననెడి కోరిక, మనస్సులో నశాంతి, అత్యాశయు కల్గుచున్నవి. రజోగుణవృద్ధికి ఇవి చిహ్నములు.

**శ్లో. అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।**
**తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన !** 13

తే.గీ. బుద్ధి మాంద్యమ్ము వెంటనే పుట్టు మరియు
బద్ధకం బది వెనువెంట వచ్చు విడక
తప్పు కజ్ఞానమును ప్రమాదములు బలియు
వరలఁగ తమోగుణ మ్మది పాండుపుత్ర !

**తాత్పర్యము :-** ఓ కురునందనా ! తమోగుణము మిక్కిలిగా వృద్ధినందినపుడు అవివేకము, మాంద్యము, పొరబాటు, మూఢభావముఁ గల్గుచున్నవి. ఇవి తమోగుణ లక్షణములు.

**శ్లో. యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రలయం యాతి దేహభృత్ ।**
**తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే ॥ 14**

తే.గీ. వెలయ సత్త్వగుణం బభివృద్ధిఁ జెంది
నపుడు మరణమ్ముఁ గాంచిన యట్టి దేహి
జ్ఞాన సంపన్ను లొందు ప్రశస్తమైన
పుణ్యలోకంబు లెల్లను బొందు విజయ !

**తాత్పర్యము :-** సత్త్వగుణము వర్ధిల్లుచున్న సమయమున మరణమును బొందిన శరీరధారి బ్రహ్మవిదులు పొందు పుణ్యలోకములను తాను పొందుచున్నాఁడు.

**శ్లో. రజసి ప్రలయం గత్వా కర్మసంగిషు జాయతే ।**
**తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15**

తే.గీ. మించఁగ రజోగుణము మరణించె నేని
కామ్య కర్మాభిలాషుల కడ జనించు
మించఁగఁ దమో గుణము మరణించె నేని
బుద్ధిహీనుల యోనులఁ బుట్టుచుండు.

**తాత్పర్యము :-** రజోగుణము వర్ధిల్లిన సమయమున మరణము నొందినవారు కర్మలయం దాసక్తి గల మనుష్యులయందును, తమోగుణము వృద్ధియందున్న సమయమున మరణించినవారు పశువులు మొదలగు నీచయోనులయందును పుట్టుదురు.

**శ్లో. కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।**
**రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥** 16

*తే.గీ. సత్త్వగుణ కర్మములకు నిశ్చయము గాఁగ*
*స్వచ్ఛమైన సుఖంబులే జగతిఁ గలుగు*
*కూడు దుఃఖంబులే రజోగుణమునకును*
*కుత్సితాజ్ఞానమే తమోగుణ ఫలమ్ము.*

**తాత్పర్యము :–** సాత్త్విక మగు కర్మమునకు ఫలము సత్త్వ ప్రధానమును, మాలిన్యరహితమునగు జ్ఞానముతోఁ గూడిన జన్మమని శిష్టులు చెప్పుదురు. రాజసమగు కర్మకు ఫలము దుఃఖ మనియు, తామసమగు కర్మమునకు ఫలము మోహము (అవివేకము) అనియును తెలిసికొనుము.

**శ్లో. సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమాద మోహౌ తమసో భవతోఽ జ్ఞాన మేవ చ ॥** 17

*తే.గీ. జ్ఞానమున్ వృద్ధిఁ బొందించు సత్త్వగుణము*
*సరగ లోభమున్ బెంచు రాజసగుణమ్ము*
*కదు ప్రమాదము మోహంబు వడిగఁ బెంచి*
*మనుజు నజ్ఞానుఁ జేయు తామసగుణమ్ము.*

**తాత్పర్యము :–** సాత్త్విక గుణమువలన జ్ఞానము పుట్టును. రాజస గుణము వలన లోభము గలుగును. తామసగుణమువలన అజ్ఞానమును, మోహమును, ప్రమాదమును (పొరపాటు) కల్గును.

**శ్లో. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।**
**జఘన్య గుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥** 18

*తే.గీ. సత్త్వగుణు లూర్ధ్వలోక వాసమ్ముఁ గొంద్రు*
*రాజసులు మధ్యలోకాల రక్తి నుంద్రు*
*మరి నికృష్ట తమోగుణపరులు హీన*
*జన్మల నధోగతిం గాంతు సవ్యసాచి !*

**తాత్పర్యము :-** సాత్త్వికులైనవారు దేవలోకాది ఊర్ధ్వలోకాలను పొందెదరు. రజోగుణ ప్రధానులు మనుష్యలోకమున పుట్టుదురు. తమోగుణ ప్రవృత్తములు (నిద్ర, ఆలస్యము, బుద్ధిమాంద్యము) గలిగినవారు హీనగుణ జన్మములు (పశుకీటకాది జన్మములు) పొందుదురు.

**శ్లో. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।**
**గుణేభ్య శ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19**

*తే.గీ. త్రిగుణములె కర్తలంచును దెలియువాఁడు*
*ప్రకృతి గుణములకంటెను పరుఁడ నేను*
*అనుచుఁ దెలిసిన సుజ్ఞాని యాత్మవిదుఁడు*
*పడయు నా స్వరూపమును తప్పకను పార్థ !*

**తాత్పర్యము :-** గుణములే కర్తలు గాని, తాను కర్త కాదనియును, ఆత్మ ప్రకృతి గుణములకంటె వేఱయిన దనియును తెలిసికొనిన ఆత్మజ్ఞాని పరబ్రహ్మ స్వరూపమును పొందుచున్నాడు.

**విశేషార్థము :-** ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వములు కల్పించుట అజ్ఞానము. కార్యకరణ విషయముల రూపమున పరిణమించిన గుణములే సర్వావస్థలలోను సర్వ కర్మములకుఁ గర్తలని గ్రహింపవలెను.

**శ్లో. గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥ 20**

*తే.గీ. అలర నీ దేహ ముత్పత్తి యగుటకొఱకు*
*కారణాలైన త్రిగుణాలఁ గాలఁ దన్ని*
*జనన మరణ జరాదుఃఖ జాలములను*
*విడువఁబడువాఁడె మోక్షముం బడయఁ గలఁడు.*

**తాత్పర్యము :-** దేహముల యుత్పత్తికి కారణములైన సత్త్వ రజస్తమము లను నీ మూఁడు గుణములను, జీవించియున్నపుడే అతిక్రమించి నట్లయిన, జీవుఁడు జన్మమృత్యు జరా దుఃఖములను దాటి బ్రహ్మ భావమును బొందును.

అర్జున ఉవాచ :-

**శ్లో. కై ర్లిఙ్గై స్త్రీ న్గుణా నేతా నతీతో భవతి ప్రభో !**
**కి మాచారః కథం చైతాం స్త్రీ న్గుణా నతివర్తతే ॥ 21**

తే.గీ. అనిన శ్రీకృష్ణుఁ జూచి యిట్లనియె నరుఁడు
త్రిగుణరాశిని దనర నతిక్రమించి
పరలువాఁ డెట్టి లక్షణాల్ వడసియుండు ?
వాని యాచార మేమి ? యే పగిది మించె
త్రిగుణరాశిని ? యెఱుగంగఁ దెలుపు శౌరి !

**తాత్పర్యము** :- విద్వాంసుఁడు జీవించియుండఁగనే త్రిగుణముల నతిక్రమించి బ్రహ్మభావమును బొందు నని శ్రీకృష్ణుఁడు చెప్పగా విని అర్జును డిట్లనుచున్నాఁడు. త్రిగుణాతీతుడైన వానిని ఎట్టి లక్షణములచేఁ దెలిసికొన వలెను ? అతడెట్టి ఆచారములచే నొప్పును ? ఈ మూడు గుణములను దాటు టెట్లు?

శ్రీ భగవా నువాచ :-

**శ్లో. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ !**
**న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ॥ 22**

**శ్లో. ఉదాసీన వదాసీనో గుణై ర్యో న విచాల్యతే ।**
**గుణావర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥ 23**

**శ్లో. సమదుఃఖసుఖః స్వస్థ స్స లోష్టాశ్మ కాఞ్చనః ।**
**తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ 24**

**శ్లో. మానావమానయో*స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।**
**సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥ 25**

తే.గీ. పాండురాజ సుపుత్ర ! యెవ్వాఁడు తనకు
ప్రాప్తమైనట్టి జ్ఞాన లోభముల మోహ
గుణమునుం గూడ ద్వేషింపఁ గోరకుండు
వాని కార్యములం బ్రీతి పడకయుండు.

* మానాపమానయోః- పాఠాంతరము

తే.గీ. ఎన్న గుణములె వర్తించుచున్న వనుచు
తగ నుదాసీన భావాన దనరువాఁ డయి
చలన మొందక స్వస్థితిన్ జారపిడక
దృఢతరమ్ముగ నెవఁడు వర్తించుచుండు.

తే.గీ. అరయ సుఖదుఃఖముల, ప్రియాప్రియములందు
పొందు స్తుతులందు మరి యపనిందలందు
కనక పాషాణ లోష్ఠములను దలంప
సమ మనోభావమం దుండఁ జాలువాఁడు.

తే.గీ. మహిఁ దలంపఁగ మానావమానములను
మిత్రులందును మఱి చూడ శత్రులందు
సముఁడుగా నుండి కామ్యకర్మములు విడిచి
తనరు వాని గుణాతీతుఁ డనిరి బుధులు.

**తాత్పర్యము :-** (22) అర్జునా ! త్రిగుణాతీతుఁడు తన బుద్ధికిఁ దట్టిన సత్త్వకార్యమును గాని, రజఃకార్యమును గాని, తమఃకార్యమును గాని ద్వేషింపఁడు. జరిగిపోయిన కార్యముల పట్ల ఆస యుంచుకొనఁడు.

**విశేషార్థము :-** త్రిగుణాతీతుఁడు సర్వకర్తృత్వతాశూన్యతను బొంది యుండును. ఇట్టి చిహ్నము లితరు లెవ్వరికిని దెలియవు. అంతఃకరణమునకు మాత్రమే తెలియును.

**తాత్పర్యము :-** (23) ప్రకృతి గుణములచేఁ గాని, వానిచే నాచరింపఁబడు పనులవలన గాని త్రిగుణాతీతుఁడు చలింపఁడు. నిశ్చల భావముతో తటస్థముగా నుండును.

**తాత్పర్యము :-** (24) త్రిగుణాతీతుఁడైనవాఁడు సుఖదుఃఖముల యందును, నిందాస్తుతులయందును, ఱాయి, బంగారములందును, ఇష్టానిష్టములందును సమానమగు భావముఁ గలవాఁడయి ధీరుఁడుగా నుండును.

**తాత్పర్యము :-** (25) మానావమానములయందును, మిత్రుల యందును, శత్రువులయందును సమానమగు భావమును గలిగి, అన్ని కార్యములను వదలియుండువాఁడు గుణాతీతుఁ డనఁబడును.

**శ్లో. మాం చ యోఽ వ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26**

తే.గీ. కన నచంచల భక్తియోగంబుచేత
అంచితంబుగ నన్ను సేవించువాఁడు
త్రిగుణముల నవలీల నతిక్రమించి
బ్రహ్మభావంబు నర్జునా ! పడయఁ గలఁడు.

**తాత్పర్యము :-** ఓ ఫల్గునా ! నిశ్చల భక్తిభావముతో నన్నెల్లప్పుడు సేవించువాఁడు ఈ త్రిగుణములను లెస్సగా నతిక్రమించి బ్రహ్మభావమును పొందఁగలఁడు.

**విశేషార్థము :-** భక్తియోగముచేత నీ గుణములు జయింపఁబడును గాన గుణములనుండి విడివడఁగోరువారికి భక్తియోగము ఉత్తమ సాధనముగాఁ జెప్పఁబడుచున్నది.

**శ్లో. బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ ।**
**శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ ॥** 27

తే.గీ. శాశ్వతం బైన మోక్ష సుస్థాన గుణము
వర సనాతన ధర్మ స్వభావరీతి
అగు పరబ్రహ్మమునకు నే నాశ్రయంబు
ధర్మరాజానుజా ! సుభద్రామనోజ్ఞ !

**తాత్పర్యము :-** నాశనము లేనిది, వికార రహితము, శాశ్వతమునైన జ్ఞానయోగముచే పొందఁదగిన ఆనందము నిత్యముగాఁ గలిగినదియు నగు పరమాత్మకు ప్రత్యగాత్మనగు నేనే ఆధారమైయున్నాను.

**విశేషార్థము :-** ప్రత్యగాత్మనగు నాకును, పరమాత్మయగు బ్రహ్మమునకును భేదము లేదు.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు

## గుణత్రయ విభాగయోగంబను

పదునాల్గవ అధ్యాయము సంపూర్ణము.
'ఓం తత్ సత్'



**శ్లో. ఊర్ధ్వమూల మధః శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।**
**ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద న వేదవిత్ ॥ (15-1)**

ఓ పార్థా ! సంసార మనునది అశ్వత్థ వృక్షము వంటిది. ఈ వృక్షమునకు వేర్లు ఎగువన, శాఖలు దిగువన ఉండును. ఈ చెట్టు నిత్యమైన దని వేదవిదులు చెప్పుచుందురు. ఈ సంసార వృక్షమునకు వేదములు ఆకులుగా నున్నవి. ఎవడు దీనిని సవివరముగా, సమూలముగా తెలిసికొనుచున్నాడో అట్టివాడే వేదముల నెఱిగినవాడు.

'అశ్వత్థ'మనగా ప్రతిక్షణము నశించునది అని అర్థము. సంసారము నొక అశ్వత్థ వృక్షముతో పోల్చి శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం పంచదశోఽధ్యాయః

## పురుషోత్తమ ప్రాప్తి యోగము

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. ఊర్ధ్వమూల మధః శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।**
**ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ ॥** 1

తే.గీ. చెలగ సంసారమను రావిచెట్టునకును
పైన వేళ్ళుండు క్రిందను వెలయు కొమ్మ
లరయ వేదంబులే యాకు లనిరి బుధులు
ఇది యెఱిగినవాడే వేదవిదుఁడు పార్థ !

**తాత్పర్యము :-** ఓ పార్థా ! సంసార మనునది అశ్వత్థ వృక్షము వంటిది. ఈ వృక్షమునకు వేర్లు ఎగువన, శాఖలు దిగువన ఉండును. ఈ చెట్టు నిత్యమైన దని వేదవిదులు చెప్పుచుందురు. ఈ సంసార వృక్షమునకు వేదములు ఆకులుగా నున్నవి. ఎవడు దీనిని సవివరముగా, సమూలముగా తెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడే వేదముల నెఱిగినవాఁడు.

**విశేషార్థము :-** 'అశ్వత్థ'మనగా ప్రతిక్షణము నశించునది అని అర్థము. సంసారము నొక అశ్వత్థ వృక్షముతో పోల్చి శ్రీ కృష్ణుఁడు చెప్పుచున్నాఁడు.

**శ్లో. అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా**
**గుణప్రవృద్ధా విషయప్రవాలాః ।**
**అధశ్చ మూలా న్యను సన్తతాని**
**కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥** 2

తే.గీ. మనుజ లోకాన నీ వృక్షమునకు వేళ్ళు
కర్మబద్ధంబులై క్రిందుగానె బర్వు
త్రిగుణముల దీని శాఖ లెంతేసు వృద్ధిఁ
జెంది విషయవాంఛ లనెడు చిగురు లొప్ప
వ్యాప్తి జెందును క్రిందికిఁ బైకి విజయ !

**తాత్పర్యము :-** ఆ సంసార వృక్షముయొక్క శాఖలు సత్త్వరజస్తమో గుణములచే నభివృద్ధి నొందింపఁబడినవై, శబ్దాదులగు విషయములు చివుళ్ళుగాఁ గలవై, మనుష్యులు మొదలు స్థావరములవఱకును, మనుష్యులు మొదలు బ్రహ్మము వఱకును వ్యాపించియున్నవి. ధర్మాధర్మ ప్రవృత్తికిఁ గారణ భూతములైన రాగము, ద్వేషము మొదలగు వాసనలు మనుష్య లోకమందే ప్రవేశించుచున్నవి. కావున మనుష్యులే కర్మాధికారులుగ వ్యవహరించుచున్నారు.

శ్లో. **న రూప మస్యేహ తథోపలభ్యతే**
**నాన్తో న చాది ర్న చ సంప్రతిష్ఠా ।**
**అశ్వత్థ మేనం సువిరూఢమూల**
**మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥** 3

తే.గీ. దీని రూపంబు నెవ్వరుఁ దెలియ లేరు,
ఆది మధ్యాంతములు గాన నలవి గాదు,
గాఢముగను వేళ్ళూను నీ ఘన తరువును
తగ నఱుకఁగ వైరాగ్య శస్త్రంబు వలయు.

**తాత్పర్యము :-** ఎవ్వరును ఈ సంసార వృక్షముయొక్క స్వరూప మిట్టిదని యెఱిగినవారు లేరు. దాని సృష్టి స్థితి లయములు (ఆది మధ్యాంతములు) తెలిసికొనుటకు శక్యములు గావు. దాని వేర్లు దృఢముగా పాదుకొనిపోయియుండును. సర్వకర్మ సన్న్యాస మనెడి ఖడ్గముచే నీ సంసార వృక్షము యొక్క దృఢ మగు వేళ్ళను నఱికివేయుటచే మరల సంసారమునకు రారు.

శ్లో. **తత: పదం తత్పరిమార్గితవ్యం**
**యస్మిన్ గతా న నివర్తన్తి భూయ: ।**
**తమేవ చాద్యం పురుషం ప్రపద్యే**
**యత: ప్రవృత్తి: ప్రసృతా పురాణీ ॥** 4

*తే.గీ. నఱికి యే చోటునం జేరి తిరిగిరారొ*
*అద్ది వెదుకంగఁ దగినట్టి దందుకొఱకు*
*విను మనాదియౌ సంసార వృత్తి యెవని*
*వలన విస్తరిల్లె నతని పరమ పురుషు*
*నాద్యు నెల్లపుడుం గొల్వ నగును పార్థ !*

**తాత్పర్యము :-** 'విరక్తి'యను ఖడ్గముచే సంసార వృక్షముయొక్క మూలమును ఖండించివైచి 'ఆది'లేని దీనికి ఆది ఎవడో, ఎవనిని చెందుటవలన మఱల జన్మము కలుగకుండునో, ఆ పరబ్రహ్మమునే పొందవలయును.

**విశేషార్థము :-** బలముగా పెరుగుచుండు సంసారమును కర్మ సన్న్యాసముచే జయించి బ్రహ్మజిజ్ఞాసచే బ్రహ్మమును పొందవలయును.

శ్లో. **నిర్మానమోహా జితసఙ్గదోషా**
**అధ్యాత్మనిత్యా వినివృత్త కామా: ।**
**ద్వన్ద్వైర్విముక్తా: సుఖదు:ఖసంజ్ఞై**
**ర్గచ్ఛ న్త్యమూఢా: పద మవ్యయం తత్ ॥** 5

*తే.గీ. త్రోచి యభిమానమున్ సఙ్గదోషములను*
*కోరికలు వీడి సుఖదు:ఖ కారణ మగు*
*ద్వంద్వము లడంచియు భగవద్ధ్యానమునను*
*బ్రహ్మపదమును జ్ఞానులు పడయఁ గలరు.*

**తాత్పర్యము :-** మానావమానములను, మోహమును వదలిపెట్టి, సంగ దోషమును వదలి, సుఖదు:ఖము లను ద్వంద్వములకు అతీతులై, వాంఛ లన్నిటిని విడిచిపెట్టి బ్రహ్మవిద్యయందు అనురక్తి గలవారై మోహమును వదలి జ్ఞానులు అవ్యయ మగు పరబ్రహ్మపదమును పొందుచున్నారు.

**శ్లో. న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః ।**
**యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥** 6

*తే.గీ. తనర నే మోక్షసుస్థానమునకుఁ జేరి*
*తిరిగి జన్మింప రాఁబోరొ, దివ్యతేజ*
*ధనులు సూర్యాగ్ని చంద్రు లేస్థాన మెనయ*
*వెలుగఁ జేయఁగ లేరొ యవ్వినుత పదమె*
*నా పరమధామమౌ నర్జునా ! నిజమ్ము.*

**తాత్పర్యము :**–పరమ శ్రేష్ఠమైన ఆ స్థానమును సూర్యుఁడు, చంద్రుడును, అగ్నియు ప్రకాశింపఁజేయఁజాలరు. ఆ స్థానమును పొందినవారలు మఱల సంసారమును పొందఁజాలరు. ఆ పరమధామము నాయొక్క ఉత్కృష్టమగు స్థానము.

**శ్లో. మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।**
**మనః షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥** 7

*తే.గీ. అలర నా యంశమైన జీవాత్మఁ దెలియ*
*తగ సనాతన మది జీవతతిని వెలిగి*
*తనర పంచేంద్రియములను మనసుతోడ*
*జేర్చి యాకర్షణంబును సేయుచుండు.*

**తాత్పర్యము :**– జీవలోకములో జీవుఁడని చెప్పఁబడునది నా అంశము వలనఁ గలిగినదే. జీవుఁడు సనాతనుఁడై యొప్పును. మనసులో గలిసిన ఆఱు ఇంద్రియములను (మనస్సు+జ్ఞానేంద్రియములు) జీవుఁడు ఆకర్షించుచున్నాఁడు.

**శ్లో. శరీరం య దవాప్నోతి య చ్చా ప్యుత్క్రామ తీశ్వరః ।**
**గృహీ త్వైతాని సంయాతి వాయు ర్గన్ధా నివాశయాత్ ॥** 8

*తే.గీ. పరగ పుష్పాదులందుండి వాయు వెట్లు*
*వాసనలఁ గొనిపోవు నా పగిది జీవుఁ*
*డెన్న నొక దేహమున్ వీడి యింక నొక్క*
*దేహముం బొందు నప్పు డింద్రియ వితతిని*
*వెంట నీడ్చుకపోవు ధీ వినుత తేజ !*

**తాత్పర్యము :-** జీవుఁడొక దేహమునుండి ఇంకొక దేహమునకును, ఒక లోకమునుండి యింకొక లోకమునకును పోవునపుడు తనవెంట మనసుతో ఆఱుగు ఇంద్రియములను దేహమునుండి ఆకర్షించి తన వెంట తీసికొని పోవును. మఱల శరీరమును బొందినపుడు మనస్సుతోఁబాటుగా ఆఱుగు ఇంద్రియములను తనతోఁబాటుగఁ జేర్చును. గాలి, తాను వీచు తావులం దన్నింటి యందును పూవుల వాసనలను తీసికొనిపోవునట్లుగ జీవుఁడు ఈ ఇంద్రియములను వెంటఁగొనిపోవును.

**విశేషార్థము :-** జన్మ రహితమగు మోక్షమును బొందువఱకును జీవుడీ యింద్రియములతోఁ గూడియుండును. దేహాంతరమును, లోకాంతరమును గూడ పొందును.

**శ్లో.** **శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ ।**
**అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే ॥** 9

*తే.గీ. జీవుఁ డీతఁడు కను ముక్కు చెవియు నాల్క*
*చర్మము మనస్సుల నిల నాశ్రయముఁ జెంది*
*శబ్ద రస రూప గంధ స్పర్శాదు లైన*
*విషయ సుఖములను ననుభవించుచు నుండు.*

**తాత్పర్యము :-** జీవుఁడు దేహముననుండి చెవి, కన్ను, ముక్కు, చర్మము, నాలుక, మనస్సు-అను ఆఱింద్రియముల మూలమున శబ్దాది విషయముల ననుభవించుచుండును.

**విశేషార్థము :-** ఇంద్రియములు జీవునకు భోగ సాధనములు. భోగ మనగా శబ్దాది విషయములు గ్రహించుట.

**శ్లో.** **ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్ ।**
**విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥** 10

*తే.గీ. దేహమున నుండు నప్పుడు, దేహ మెడలి*
*పోవు నప్పుడును విషయంబులను ననుభ*
*వించు నప్పుడున్ తగ గుణాన్వితుని గాఁగ*
*జీవునిన్ జ్ఞాను లిలను దర్శింపఁ గలరు*
*జ్ఞానహీనులు దర్శింపఁ జాల రెపుడు.*

**తాత్పర్యము :-** జీవుఁడు తాను దేహమునందు ప్రవేశించునపుడును, దేహమును వదలిపోవునపుడును, శబ్దాది విషయములను, సుఖదుఃఖ మోహాది గుణములను చెందియుండుటచే విషయభోగములకు లోలు రయిన అవివేకులు దానిని తెలిసికొనఁజాలరు. జ్ఞానదృష్టిగలవారు మాత్రము తెలిసికొందురు.

**శ్లో. యతన్తో యోగిన శ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్ ।**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః ॥** 11

*తే.గీ. జ్ఞానసిద్ధికి యత్నించు ధ్యానపరులు*
*అలర తనలోన నున్న నీ యాత్మ నెపుడు*
*చక్కఁగాఁ జూతు, రాత్మ సంస్కార హీన*
*జనులు యత్నించు చుండినన్ కనగలేరు.*

**తాత్పర్యము :-** యోగీంద్రులు తమ మనస్సును జయించిన కారణమున తమ దేహమందున్న ఆత్మయే పరమాత్మయని తెలిసికొనగలుగుచున్నారు. మనసును జయింపలేక పోయిన అవివేకులు ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికిని ఆత్మజ్ఞానమును పొందలేకున్నారు.

**శ్లో. య దాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।**
**య చ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥** 12

*తే.గీ. జగము నంతయు సత్ప్రకాశమున దేల్చు*
*సూర్యునందున్న తేజమున్ సురుచిరముగ*
*అగ్నియందును చంద్రునియందు నున్న*
*తేజమును నేనె యంచును తెలియు మనఘ !*

**తాత్పర్యము :–** సూర్యమండలమునందుండి లోకము లన్నిటిని వెలిగించుచుండు తేజస్సు నాది. చంద్రుని రూపములో నున్న సౌమ్య మగు తేజస్సును, అగ్నిలోనుండు తీవ్ర మగు తేజస్సును గూడ నేనే నని తెలిసికొమ్ము. అన్నింటియందుండు తేజస్సుగూడ అధిష్ఠాన మగు నాదే సుమా !

**శ్లో.** **గామావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా ।**
**పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥** 13

*తే.గీ. భూమి లోపలఁ జొచ్చి యీ భూతములను*
*సర్వము భరింతు నాయొక్క శక్తివలన*
*జగతిని రస స్వరూపుఁడౌ చంద్రుఁడ నయి*
*ఓషధుల నెల్లఁ బోషింతు నోయి విజయ !*

**తాత్పర్యము :–** నేను ఓజస్సు రూపమున భూమిలోనుండి నా బలముచే సమస్త భూతములను ధరించుచున్నాను. సర్వరసముల శుద్ధ స్వరూపమగు చంద్రుని రూపముగా సమస్తములగు ఓషధులను రసవంతములుగ, పుష్టిగల వానినిగాఁ జేయుచున్నాను.

**శ్లో.** **అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతు ర్విధమ్ ॥** 14

*తే.గీ. వెలయు వైశ్వానరుం డన్న పేరుఁ గలిగి*
*నట్టి జఠరాగ్ని నౌచును నఖిలప్రాణి*
*దేహముల నాశ్రయించి యుత్తేజ మొలుక*
*వరుస నెంతొ ప్రాణాపానవాయువులను*
*జేరి జీర్ణం బొనర్తు నాహారములను.*

**తాత్పర్యము :–** నేను అన్ని ప్రాణులయొక్క శరీరములను ఆశ్రయించి వైశ్వానరుఁడనై ప్రాణము, అపానము అను వాయువులతోఁ గలిసి వారు భుజించిన నాలుగు విధములైన ఆహారమును జీర్ణము చేయుచున్నాను.

**విశేషార్థము :–** చతుర్విధము లనగా – భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యము లనఁబడునవి.

**శ్లో. సర్వస్య చాహం హృది సన్నివిష్టో**
**మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ।**
**వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యో**
**వేదాన్త కృద్వేద విదేవ చాహమ్ ॥ 15**

*తే.గీ. సకల జీవుల హృదయాల సంచరింతు*
*స్మృతియు జ్ఞానము మరపు నాచేతఁ గలుగు*
*పరగు వేదాల నెఱుఁగంగఁబడుదు నేను*
*వెలయు వేదాంతకర్త నే వేదవిదుఁడ.*

**తాత్పర్యము :-** నేను అన్ని ప్రాణుల హృదయములందు అధిష్ఠించి యుందును. పూర్వజ్ఞానమును, ప్రస్తుత జ్ఞానమును, యుక్తాయుక్త వివేకమును నావలననే కలుగుచున్నవి. శ్రుతులచేతను, స్మృతులచేతను తెలియఁదగినవాఁడను నేనే. వేదాంతములకు ప్రవర్తకుఁడను, వేదవిదుఁడను నేనే.

**శ్లో. ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ।**
**క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ 16**

*తే.గీ. జగమునందున క్షరుఁడు నక్షరుఁడు ననఁగ*
*పురుషు లిఱువురు గల, రందు భూతతతిని*
*దనరు పురుషుని క్షరుఁడని యనెద రనఘ*
*సకల కూటస్థపురుషు నక్షరు డటంౘ్రదు.*

**తాత్పర్యము :-** లోకమున పురుషులు క్షరుఁడని; అక్షరుఁడని; రెండు విధములు. సకల భూతకోటిలో నలరు పురుషుఁడు 'క్షరుఁడ'ని, కూటస్థుఁడగు జీవుఁడు 'అక్షరుఁడ'ని తెలియఁబడుచున్నాఁడు.

**విశేషార్థము :-** 'క్షరమ'నగా - క్షేత్రము (దేహము), 'అక్షర'మనగా - జీవుఁడు.

**శ్లో. ఉత్తమః పురుష స్త్వన్యః పరమా త్మేత్యుదాహృతః।**
**యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః ॥ 17**

*తే.గీ. నాశ రహితుండునైన సర్వేశు డతడు*
*మూడు లోకాల భరియించు మోక్షదాత*
*ఘనుడు భావింపగా క్షరాక్షరులకంటె*
*అన్యుడగు నాతడే పరమాత్ముడండ్రు.*

**తాత్పర్యము :-** పైన చెప్పిన క్షరుడు, అక్షరుడు అను పురుషు లిద్దఱికంటె భిన్నుడయిన పురుషోత్తముడొకడున్నాడు. అతడు శ్రుతులచేతను, స్మృతులచేతను ప్రసిద్ధుడయి నిర్వికారుడుగా నుండి మూడు లోకములను తన చైతన్య శక్తిచే నిండియుండును. వేదాంతములలో అతనిని దేహేంద్రియ మనోబుద్ధులకంటె భిన్నమైన 'పరమాత్మ'యని చెప్పెదరు.

**శ్లో. యస్మాత్క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18**

*తే.గీ. జగమునం దెన్నగా క్షరాక్షరుల కంటె*
*శ్రేష్ఠుడన నొప్పుచున్ నేను వెలుగుచుంట*
*లోకములలోను వేదాలలోను నేనె*
*తనర మతి గొంటిని పురుషోత్తముడనంగ.*

**తాత్పర్యము :-** క్షరునికంటెను, అక్షరునికంటెను విలక్షణుడనై యొప్పుటచేత అన్ని లోకములలోను, వేదాలలోను నాకు మాత్రమే పురుషోత్తముడను ఖ్యాతి గల్గినది.

**విశేషార్థము :-** భక్తులు 'పరమాత్మ'యని, 'పురుషోత్తము'డని కీర్తించుచుండువాడు ఇందు వర్ణింపబడినాడు. పరమాత్ముని దెలియుటవలన గలుగు ప్రయోజనము ముందు ముందు తెలుపబడుచున్నది.

**శ్లో. యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।**
**స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ! 19**

తే.గీ. మోహరహితుండునై జ్ఞాన బుద్ధిఁ గలిగి
ఇట్లు పురుషోత్తమునిగ న న్నెఱుఁగువాఁడు
సర్వవిదుఁ డౌచు నొప్పుచు సర్వవిధుల
నన్ను భజియించు చివరకు నన్నె పొందు.

**తాత్పర్యము :-** మోహమును వదలి, నిర్మలబుద్ధితో పూర్వము చెప్పఁబడిన విధముగా పురుషోత్తముఁ డగు నన్ను ఎవ్వఁ డెఱుగునో, వాఁడు సర్వజ్ఞుఁడయి సర్వభూతములయందు సర్వాత్మ భావముచే నన్ను సేవించుచు నన్నే పొందును.

**శ్లో. ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ !**
**ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యాత్ కృతకృత్యశ్చ భారత ! 20**

తే.గీ. అరయ నతి రహస్యం బైన యట్టి శాస్త్ర
మిద్ది నేఁ జెప్పినాను నీ వెఱిఁగి యనఘ !
జ్ఞానవంతుండవై మేల్మి సకలగతుల
వర కృతార్థుఁడ వగు మోయి పాండుపుత్ర !

**తాత్పర్యము :-** పాపరహితుఁడ వగు అర్జునా ! మిక్కిలి రహస్య మగు నీ శాస్త్రమును నీకు వివరముగాఁ దెలిపితిని. దీనిని చక్కగా తెలిసికొనువాఁడు కృతకృత్యుఁ డగును. ఇది ముమ్మాటికి సత్యము.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు

**పురుషోత్తమ ప్రాప్తి యోగంబను**

పదునైదవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'



శ్లో. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రియం త్యజేత్ ॥

(16-21)

నరకమునకు కామ క్రోధ లోభము లను మూఁడును మార్గములు. ఈ మూఁడు ద్వారములును ఆత్మను నశింపఁజేయును. కావున ఈ మూఁడింటిని తప్పక విడువవలయును.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం షోడశోఽధ్యాయః

## దైవాసుర సంపద్విభాగ యోగము

*శ్రీ భగవానువాచ :-*

శ్లో. అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥ 1

శ్లో. అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్ ॥ 2

శ్లో. తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా ।
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత ! 3

*తే.గీ. సత్త్వశుద్ధి, తపంబు నిష్కపటగుణము,*
*దమము, దానము, యజ్ఞ మధ్యయనగుణము*
*అభయమును జ్ఞానయోగమునందు నుంట,*
*సత్య మక్రోధము నహింస శాంతగుణము*
*త్యాగమున్ భూతదయయు మార్దవగుణమ్ము*
*విషయ వాంఛా విదూరత వెలయ సిగ్గు*
*చంచలంబౌ స్వభావంబు చాలనెట్టి*
*కొండెములు చెప్పకుండుట కువలయమున*
*ద్రోహ మెంచక యభిమాన దూరు డగుట*
*క్షమయు తేజస్సు ధృతియును శౌచములును*
*అరయ దైవాంశ సంభవులైన యట్టి*
*వారికి లభించు దైవసంపదలు పార్థ !*

**తాత్పర్యము :-** దైవ సంబంధమైన ప్రకృతి గలవారికి ఇరువదియాఱు గుణములు ముఖ్యములని వివరించుచున్నాఁడు. భయము లేకుండుట; ఆత్మ శుద్ధి, జ్ఞాన యోగము నాశ్రయించుట, దానము, బాహ్యేంద్రియములను నిగ్రహించుట, సత్త్వము ప్రధానముగా నుండుట, తపస్సు, యజ్ఞదీక్ష, ఎల్లప్పుడు సరళమగు భావముఁ గలిగియుండుట, హింస చేయకపోవుట, సత్యమునే పలుకుచుండుట, కోపము లేకుండుట, కోరికలు లేకుండుట, స్థిరముగా నుండుట, ఇతరుల దోషము లెంచకుండుట, దయాగుణముఁ గలిగి యుండుట, లజ్జ, మృదుత్వము, అంతరింద్రియ నిగ్రహము, సన్న్యాసము, సూక్ష్మమగు బుద్ధిఁ గలిగియుండుట, ఓర్పు, బాహ్యమునను మఱియు అంతరమునను అట్లే శుచిఁ గలిగియుండుట, ఇతరులకు ద్రోహము చేయవలెనను తలంపు లేకుండుట, ధైర్యము, గర్వము లేకపోవుట అనునవి దేవతా సంబంధమగు సంపదతో జనించినవారికి గలుగుచున్న గుణములు.

**శ్లో. దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ ।**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ ! సంపద మాసురీమ్ ॥** 4

తే.గీ. *దంభ మభిమానమున్ క్రోధ దర్పములును*
*జగతి నజ్ఞాన వాక్పరుషత్వములును*
*అరయ నసురాంశ సంభవులైన యట్టి*
*వారి కిలఁ గల్గు నసుర సంపద లనంగ.*

**తాత్పర్యము :-** అర్జునా ! అసుర సంబంధమైన సంపత్తిగలిగి పుట్టినవారికి ప్రగల్భములు పలుకుట, గర్వము (ధనాదులవలన), అభిమానము, దురాగ్రహము, పరుషమగు వాక్కులు పలుకుట, యుక్తాయుక్తవివేకము లేకపోవుట అను నీ ఆఱు గుణములును గలుగుచున్నవి.

**శ్లో. దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।**
**మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ !** 5

*తే.గీ. దైవ సంపద యొసఁగును తప్పకుండ*
*భువిని సంసారబంధ విమోచనంబు*
*నసుర సంపద బంధమ్ము నటులె పెంచు*
*నీవు దైవాంశమున బుట్టినావు గాన*
*దుఃఖపడఁబోకు మర్జునా ! దుఃఖపడకు.*

**తాత్పర్యము :-** దేవతాసంబంధమగు గుణములు మోక్షమునకును, ఆసురగుణ విశేషములు సంసారబంధమునకును హేతువులుగాఁ జెప్పఁబడినవి. దేవతాసంబంధములగు గుణములచేఁ బుట్టినాఁడవు కావున నీవు దుఃఖింపవలదు.

**శ్లో. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।**
**దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ ! మే శృణు ॥ 6**

*తే.గీ. అవని దైవాంశులన రాక్షసాంశు లనఁగ*
*ద్వివిధముల భూత సంసృష్టి వెలయుచుండు*
*విజయ ! వివరించితిని 'దైవ' వివరములను*
*అసురగుణముల వివరింతు నరయు మింక.*

**తాత్పర్యము :-** అర్జునా ! ఈ లోకమునందు దైవాంశఁగలవారనియు, ఆసురాంశఁగలవారనియు రెండు విధములగు ప్రాణులు సృష్టింపఁబడుచున్నవి. దేవతాసంబంధమైన సృష్టిని గూర్చి మునుపే చెప్పియున్నాను (15వ అధ్యాయము). ఇక ఆసుర సంబంధ స్వభావముఁ గలవారిని గూర్చి వివరముగాఁ జెప్పెదను. వినుము.

**శ్లో. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7**

*తే.గీ. అసుర గుణములఁ బుట్టిన యట్టివారు*
*చేయఁదగినట్టి మఱియును చేయఁ దగని*
*పను లెఱుంగరు వారిలోఁ గనఁగ రాదు*
*సత్య శౌచ గుణంబు లాచారవిధులు.*

**తాత్పర్యము :-** అర్జునా ! ఈ లోకములో ఆసుర సంపత్తితోఁ బుట్టినవారు మంచి చెడులను బోధించు శాస్త్రములను ఎఱుఁగరు. వారికి బాహ్య శౌచ సంబంధములైన స్నాన సంధ్యాదులు గాని, అంతశ్శౌచ కారకములైన అహింసాదులుఁ గాని యుండవు. వారి కాచారము లేదు. సత్యము వారియందు ఏ మాత్రమును ఉండదు.

**శ్లో. అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్ ।**
**అపరస్పర సమ్భూతం కి మన్య త్కామహైతుకమ్ ॥ 8**

*తే.గీ. జగ మసత్యమె యగు ననీశ్వరము మఱియు*
*అప్రతిష్ఠము నని రాక్షసాంశమందు*
*పుట్టినట్టివా రందురు, భువన మెల్ల*
*స్త్రీ పురుషుల సంబంధముచేతఁ గలుగు*
*కామమే కారణము వేఱుగా దటంద్రు.*

**తాత్పర్యము :-** ఆసురసంపదచేఁ బుట్టినవారు ఈ ప్రపంచ మంతయు తమవలెనే అసత్యమనియు, ధర్మశూన్యమనియు, ఈశ్వరుఁడు లేడనియు, స్త్రీ పురుషుల కామోద్రేకముచేతనే ఈ ప్రపంచమంతయుఁ గలిగినదనియు, కామము తప్ప ఇంకేదియు కారణము కాగలది కాదనియు అభిప్రాయమును ప్రకటించుచుందురు.

**శ్లో. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మా నోఽల్పబుద్ధయః ।**
**ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9**

*తే.గీ. ఫల్గునా ! ఇట్టి నాస్తిక భావ మొంది*
*స్వల్ప బుద్ధులు దుర్మతుల్ జగమునకును*
*క్రూర కర్మలఁ జేయు శత్రువులయి*
*నాశమున్ జేయఁ బుట్టుచున్నారు భువిని.*

**తాత్పర్యము :-** అర్జునా ! ఆసుర సంపత్తితోఁ గూడినవారు పైన చెప్పిన గుణములు గలిగి దుర్మతిచే అల్పబుద్ధులు, నష్టాత్ములు, క్రూరకర్ములు, లోకమునకు శత్రువులు నయి లోకనాశమునకు కారకులగుచున్నారు.

**శ్లో. కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమాన మదాన్వితాః ।**
**మోహా ద్గృహీత్వాఽ సద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽ శుచివ్రతాః ॥ 10**

*తే.గీ. దురభిమానము దంభము గరువముఁ గొని*
*అంతులేనట్టి కోరికలందు మునిఁగి*
*దుర్గుణము నవివేకమున్ తోడుగాఁగ*
*వారు వర్తింత్రు నీచులై వసుధయందు.*

**తాత్పర్యము :–** వారు హద్దులేని కామముచే మోహితులై కోరఁగూడని కోరికలను కోరుచు, క్షుద్రదేవతలను గొలుచుచు దంభము, మానము, మదము అను గుణములు గలిగి మోహములోఁబడి అపవిత్రములగు కార్యములను ఆచరింతురు.

**శ్లో. చిన్తా మపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః ।**
**కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః ॥ 11**

*తే.గీ. కామభోగానుభవమె స్వర్గం బటంచు*
*ఇంతకంటెను పురుషార్థ మేది యనుచు*
*అపరిమితమైన ప్రళయాంతమైన విషయ*
*చింతలనె యాశ్రయించి నశించుచుంద్రు.*

**తాత్పర్యము :–** వారు అంతులేని కోరికల నాశ్రయించి కామభోగములే తమ సర్వస్వముగఁ దలంచి, వాటికొఱకై తమ జీవితకాల మంతయు వెచ్చించుచు, 'మరణ'మను మాటనే మఱచి వ్యవహరించుచున్నారు.

**శ్లో. ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః ।**
**ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్ ॥ 12**

*తే.గీ. పలు విధముల నాశాపాశ బద్ధుఁగుచు*
*కామమున్ క్రోధములనె ముఖ్యములు గాఁగ*
*విషయ భోగంబుల ననుభవించుకొఱకు*
*అక్రమ ధనార్జనకు మార్గ మరయుచుంద్రు.*

**తాత్పర్యము :-** వారు వందలకొలది ఆశలనెడి త్రాళ్ళచేఁ గట్టఁబడి, కామము నందును, క్రోధమునందును తగుల్కొనినవారై యీ లోకమున కామ భోగములను బొందుటకై పరద్రవ్యాపహారణము మున్నగు అన్యాయ కార్యములచే ధనరాశులను సంపాదింపఁగోరుచున్నారు.

**శ్లో. ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ ।**
**ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్ ॥** 13

*తే.గీ. ఇంత ధన మిప్డు నే గడియించినాను*
*ఇంత యున్నది యైన నే నింతకంటె*
*మించియును గూడ ధనము గడించగలను*
*కోరికల నెల్ల నే దీర్చుకొనెద నింక.*

**తాత్పర్యము :-** నేను ఇప్పుఁడింత ద్రవ్యమును సంపాదించితిని, నాకు కావలసిన కోరికలను ఈ ధనముచే చెల్లించుకొనఁగలను. ఇంతకంటెను ఎక్కువ ధనము సంపాదింపగలను.

**శ్లో. అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి ।**
**ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥** 14

*తే.గీ. శత్రుఁ డీతఁడు నాచేతఁ జంపబడియె*
*ఇతర శత్రుల నిట్లె నే హత మొనర్తు*
*నేనె ప్రభువును భోగియు నేనె సుఖియు*
*ప్రబలుఁడను నేనె సిద్ధుఁడౌవాఁడ నేనె.*

**తాత్పర్యము :-** నేను ఈ శత్రువులను చంపితిని, ఇతర శత్రువులను గూడ ఇట్లే చంపఁగలను. నేను ఈశ్వరుఁడను, పరమభోగిని; నేను సంపన్నుఁడను; బలవంతుఁడను; నాకు సుఖములకు లోపము లేదు.

**శ్లో. ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా ।**
**యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥** 15

తే.గీ. ధనముఁ గలవాఁడ నే దాన ధర్మములను
యజ్ఞ యాగాలుఁ జేసెదునట్టివాఁడ
ఉన్నతం బైన వంశస్థుఁ డెన్న నేను
అందు రవివేకులై పార్థ ! యసుర గుణులు.

**తాత్పర్యము :–** "నేను ధనవంతుఁడను, నాది గొప్ప కుటుంబము, నాకు సాటి వచ్చువాఁడు ఇంకెవ్వఁడును లేడు. యజ్ఞములు చేయుదును. యాచకులకు ధనము నిత్తును. అంతులేని సంతోషమును పొందుదును" అని అజ్ఞాన మోహితులై ఆసురస్వభావులు పలుకుచుందురు.

**శ్లో. అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।**
**ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥** 16

తే.గీ. మోహమను వలఁ జిక్కి కామోపభోగ
లాలసులునై మనోవికారాలఁ దగిలి
అత్యసహ్యాకరం బైన యట్టి ఘోర
నరక మందునఁ గూలుచున్నారు విజయ !

**తాత్పర్యము :–** అనేక విధములగు చిత్తవిక్షేపములతో మోహ మనెడి వలలోఁ జిక్కుకొన్నవారై విషయభోగములందు ఎక్కువ ఆసక్తి గలవారై ఆసురభావ సంపదఁగలవారు రౌరవాది ఘోర నరకములను బొందుచున్నారు.

**శ్లో. ఆత్మ సమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।**
**యజన్తే నామయజ్ఞై స్తే దమ్భేనావిధి పూర్వకమ్ ॥** 17

తే.గీ. సిగ్గువిడి తమ్ము తామే ప్రసిద్ధులుగను
పొగడి కొంచును పెద్దలఁ దెగడు చుండ్రు
ధనమదాంధతతో దుష్టదంభయుక్తి
విధి విరుద్ధ యజ్ఞ మొనర్తు రీ పేర్లకొఱకు.

**తాత్పర్యము :–** తమ్ము తాము పొగడుకొనుచు, పెద్దలను దూషించుచు ధనసంపదచే అభిమాన మదములతోఁ గూడి శాస్త్రవిధులకు వ్యతిరేకముగా నామమాత్రపు యజ్ఞములను చేయుచున్నారు.

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ 18

తే.గీ. దర్పము బలమ్ము క్రోధమ్ము ధరణి నొంది
అత్యహంకారు లయి తమయందు నితర
దేహముల నుండు నన్నెంతొ ద్వేష మొప్ప
నరకు సేయక మంచిని నైపకుంద్రు.

**తాత్పర్యము :-** వారు అహంకారమును, బలమును, గర్వమును, క్రోధమును ఎక్కువగా ఆశ్రయించినవారై, వారియందును ఇతరులయందును గూడ అంతర్యామినైయున్న నన్ను లెక్కచేయక, అసూయాపరులై ఇతరులను ద్వేషించుచున్నారు.

శ్లో. తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు ॥ 19

తే.గీ. సకల జీవులయందు నీశ్వరుఁడనైన
నన్ను ద్వేషించు క్రూరులౌ నరుల నేను
జనన మరణ ప్రవాహ సంసారములను
అసుర యోనులఁ బుట్టింతు ననవరతము.

**తాత్పర్యము :-** ద్వేషభావముఁ గలిగి దుర్మార్గులై చెడు పనులను జేయునట్టి క్రూరులను, నరాధములను సంసారమున అసురయోనులయందే ఎల్లప్పుడును త్రోసివేయుచుందును.

శ్లో. ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మా మప్రాప్యైవ కౌన్తేయ ! తతో యా న్త్యధమాం గతిమ్ ॥ 20

తే.గీ. అసుర యోనుల జన్మించి నట్టి మూఢ
మానవులు నెప్డు జన్మజన్మములయందు
నన్ను బొందంగ లేక యెన్నంగరాని
అధమమైనట్టి జన్మల నందుచుంద్రు.

**తాత్పర్యము :-** వారు జన్మ జన్మాంతరములలో ఆసురయోనులందు జన్మించుటయే గాక అవివేకులైన కారణమున నన్ను పొందలేక అధమ గతిని పొందుదురు.

**శ్లో. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।**
**కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రియం త్యజేత్ ॥ 21**

*తే.గీ. ఆత్మనాశన కారకమైన యట్టి*
*ఇట్టి నరకంబునకు దారు లెన్న మూఁడు*
*కామమున్ క్రోధమును లోభగతులు నవ్వి*
*కాన వీనిని త్యజియింపఁగా వలయును.*

**తాత్పర్యము :-** నరకమునకు కామ క్రోధ లోభము లను మూఁడును మార్గములు. ఈ మూఁడు ద్వారములును ఆత్మను నశింపఁజేయును. కావున ఈ మూఁడింటిని తప్పక విడువవలయును.

**శ్లో. ఏతై ర్విముక్తః కౌన్తేయ ! తమోద్వారై స్త్రిభి ర్నరః ।**
**ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥ 22**

*తే.గీ. నరక హేతువు లౌచు నున్నట్టి యిట్టి*
*మూఁడు దుష్ట గుణాల విముక్తి నొంది*
*శ్రేయ మొలికించు కర్మలఁ జేసి చేసి*
*పరమగతియగు మోక్షముం బడయఁ గలరు.*

**తాత్పర్యము :-** కామ క్రోధ లోభము - లనెడి యీ మూఁడు నరక ద్వారములను దాటి సత్కార్మల నాచరించిన నరుఁడు మోక్షమును బొందును.

**శ్లో. య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్ ॥ 23**

*తే.గీ. శాస్త్ర విధులన్ని మూర్ఖతన్ జారవిడిచి*
*తోచి నట్టుల వర్తించు దుష్టజనుఁడు*
*జ్ఞాన సుఖమును, సిద్ధిని బూనలేఁడె !*
*ఉత్తమం బైన మోక్షంబు నొందునెట్లు ?*

**తాత్పర్యము :-** శాస్త్రవిధిని వదలి తన యిష్టము వచ్చినట్లు ప్రవర్తించువానికి, కర్మముయొక్క ఫలముగాని, శాంతిగాని కలుగదు. అట్టివానికి ఇక మోక్ష మెట్లు కలుగఁగలదు ?

**శ్లో. తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥** 24

*తే.గీ. అందువలన కార్యము నకార్యములయందు*
*శాస్త్రమె ప్రమాణమౌ నిలన్ సర్వగతుల*
*కాన శాస్త్రోక్త విధులతో కర్మములను*
*తెలిసి చేయుటె ఫలము కుంతీకుమార !*

**తాత్పర్యము :-** కార్యమునకును, అకార్యమునకును శ్రుతి, స్మృతి మీమాంసలే ప్రమాణములు. అవియే జ్ఞానసాధనములు. కావున, శాస్త్రములచే నుపదేశింపఁబడిన ధర్మమును తెలిసికొని నీవు స్వధర్మమగు యుద్ధమును చేయఁదగియున్నావు.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
దైవాసుర సంపద్విభాగ యోగంబను
పదునాఱవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'



శ్లో. ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥

(17-23)

ఉత్తమములైన ఓం, తత్, సత్ – అను మూడు నామములచే పిలువబడుచున్నది పరబ్రహ్మము. ఆ త్రివిధనిర్దేశముచేతను సృష్టి మొదటిలో వేదములు, యజ్ఞములు, బ్రాహ్మణులు సృష్టింపబడిరి.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం సప్తదశోఽధ్యాయః

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

*అర్జున ఉవాచ :-*

**శ్లో. యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః ॥** 1

*తే.గీ. అనిన భగవానుఁ జూచి యర్జునుఁడు పలికె*
*స్వామి ! శాస్త్ర సమ్మతిఁ గాకుండ శ్రద్ధఁ గలిగి*
*చేయువారల పూజలు సిద్ధిఁగనునె*
*సాత్త్వికము రాజసము తామసమ్ములందు*
*ఎట్టిదగు వారిపూజ? నాకెఱుగఁ జెప్పు.*

**తాత్పర్యము :-** హే కృష్ణా ! శాస్త్రోక్త విధానమును గుర్తెఱుగ లేక పోవుటచే దాని ననుసరింపలేక శ్రద్ధతో మాత్రము కూడుకొన్నవారై, దేవతలను పూజించెడివారు ఏ విధముగా నడచుకొందురు ? సాత్త్వికమా ? రాజసమా? తామసమా ?

*శ్రీ భగవా నువాచ :-*

**శ్లో. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥** 2

*తే.గీ. అనుచుఁ గోరిన యర్జునుఁ గని ముకుందుఁ*
*డనియె నీ రీతిగా శ్రద్ధ యనున దరయ*
*జన్మజన్మాంతరాల సంస్కారమునను*
*సాత్త్వికము రాజసము తామసమ్ము లనఁగ*
*త్రివిదములు దాని వివరింతుఁ దెలియ వినుము.*

**తాత్పర్యము :-** అనగా పరమాత్మ ఓ అర్జునా ! దేహధారులకు వారి వారి స్వభావమును బట్టి మూడు విధముల శ్రద్ధ కలుగుచున్నది. సాత్త్వికము, రాజసము, తామసము - అనబడు ఈ శ్రద్ధను వివరించుచున్నాను.

**శ్లో. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత !**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః ॥ 3**

*తే.గీ. స్వాంత సంస్కారమును బట్టి శ్రద్ధ గలుగు,*
*గుణములను బట్టియే నమకూడు శ్రద్ధ*
*తద్గుణానురూపంబుగా ధరణిలోన,*
*వినుము పాండవమధ్యమా ! విపులముగను.*

**తాత్పర్యము :-** అర్జునా ! సమస్తప్రాణులకుఁ గూడ శ్రద్ధ వారి వారి సంస్కారమునుబట్టి కలుగుచున్నది. ఏ పురుషుఁ డెట్టి శ్రద్ధను ధరించినవాఁడో, వారి వారి గుణములనుబట్టి గ్రహింపవచ్చును.

**విశేషార్థము :-** అందఱు మనుష్యులకు కరచరణాదులు సమానములైనను వారి తెలివితేటలు వేఱు. ముఖ్యమైన భేదము బాహ్యము కాదు; లోపల నున్నది. 'శ్రద్ధ' అంతఃకరణ గుణభేదముచే కలుగునట్టిది.

**శ్లో. యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।**
**ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః ॥ 4**

*తే.గీ. సాత్త్వికులు దేవతలఁ గొల్తురి సన్నుతింత్రు,*
*రాక్షసుల యక్షులం గొల్తురి రాజసులును,*
*ప్రేతభూత పిశాచాలఁ బ్రేమఁ గొల్తురి*
*తామసగుణ ప్రధాను లిద్దరను విజయ !*

**తాత్పర్యము :-** సాత్త్వికగుణ సంపన్నులు దేవతల ప్రీతికొఱకై యాగములు చేయుదురు. రాజసగుణము గలవారు యక్షరాక్షసులను గొలుతురు. తామసులు ప్రేతములను, భూతములను సేవింతురు.

**శ్లో. అశాస్త్ర విహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।**
**దమ్భాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ 5**

**శ్లో. కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః ।**
**మాం చైవాన్త శ్శరీరస్థం తా న్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ 6**

*తే.గీ. కామరాగ మదంబులఁ గడు మదమున*
*దంభము న్నహంకారంబుఁ దనరుచుండ*
*ఘోర మైనట్టియును శాస్త్రదూరమైన*
*తప మొనర్చుచు నాత్మ శుద్ధంబు లేని*
*తమ శరీరములందు నెంతయును నొప్పు*
*నింద్రియంబుల మఱియు నెంతేని వారి*
*సూక్ష్మ దేహములం దొప్పుచుండు నన్ను*
*మఱి మఱి కృశింపఁ జేతు రాసురులు వారె.*

**తాత్పర్యము :-** ఆసురభావముతోఁ గూడినవారు దంభము, అహంకారము, కామము, రాగము, బలముఁ గలిగి యుక్తాయుక్తజ్ఞానము లేనివారై తాము చేయు భీకరమైన పనులచే శరీరమునందలి ఇంద్రియ సమూహమును కృశింపఁజేయుచు శరీరమునందు సాక్షినైయున్న నన్నుఁగూడ కృశింపఁజేయుచున్నారు. వారు నా తత్త్వముఁ దెలియని మూఢచేతస్కులు. కావున వారిని ఆసురభావముఁ గలవారినిగాఁ దెలిసికొనుము.

**శ్లో. ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।**
**యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు ॥ 7**

*తే.గీ. అవని ప్రాణుల కెల్ల నాహార మరయ*
*మూఁడు విధములఁ బ్రియములై పొసగుచుండు*
*అటులె తపమును దానము యజ్ఞమరయ*
*త్రివిధములు వాని భేదమ్ముఁ దెలిపెద విను.*

**తాత్పర్యము :-** ప్రాణులన్నింటికిని వారివారి గుణములనుబట్టి ఆహారము మూఁడు విధములుగా నుండును. ఆ విధముగనే వారి వారి యజ్ఞ, దాన, తపములుఁ గూడ మూఁడు విధములుగనే యుండును. ఈ విషయమును వినుము.

**శ్లో. ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।**
**రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥ 8**

*తే.గీ. ఆయువు మనోబలమ్ము దేహమున బలము,*
*ప్రీతియు, సుఖమ్ము నారోగ్య వితతిఁ బెంచి*
*స్నిగ్ధమై రసవంతమై స్థిరత నొప్పు*
*నట్టి యాహారమే ప్రియం బౌను సత్త్వ*
*గుణముఁ గలవారి కిలలోన గుణవరేణ్య !*

**తాత్పర్యము :-** సాత్త్వికులకు ప్రియమైన ఆహారము ఆయుర్దాయమును, దేహమును, బలమును, బుద్ధిబలమును, ఆరోగ్యమును, సుఖమును, సంతోషమును వృద్ధిచేయును. రసవంతములు, దేహమున చిరకాలము ఉండునవి, చమురుఁగలవి, హృదయమునకు హితకరములునైన భోజన పదార్థములు సాత్త్వికగుణ సంపదఁ గలవారికి ఇష్టము లగుచున్నవి.

**శ్లో. కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః ।**
**ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ 9**

*తే.గీ. చేదు పులు పుప్పు కారంబుఁ జెంది మిగుల*
*సారహీనమై దప్పికఁ జాలఁ గూర్చి*
*కష్టములు రోగములును దుఃఖములు మిగులఁ*
*బెంచు నాహారమే కడు ప్రియముగూర్చు*
*ధర రజోగుణ జీవు లెల్లరకు పార్థ !*

**తాత్పర్యము :-** రజోగుణము ప్రధానముగాఁ గలవారికి ఇష్టములగు పదార్థములు : ఎక్కువ కారము, పులుపు, ఉప్పుఁ గలిగినవి, వేడిచేయునవి, తీక్ష్ణమైనవి, పొడి పొడిగా నుండునవి, దుఃఖమును, శోకమును, రోగమును గలుగఁజేయునవి అగు భోజనపదార్థములు రాజసగుణముఁ గలవారికి ఇష్టము లగును.

**శ్లో. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10**

*తే.గీ.* *చల్లఁబడినది, పాచిన చలిది మఱియు*
*వేరొకరు తిని ధరఁ బారవేసినట్టి*
*పూజనీయము గానట్టి భోజనంబు*
*తామసగుణాఢ్యులకుఁ బ్రీతిఁ దనరఁ జేయు.*

**తాత్పర్యము :-** తామసులగువారికి బాగుగా ఉడకనిది, రుచిలేనిది, దుర్గంధముతోఁ గూడినది, చలిది, భుజింపగా మిగిలినది, యజ్ఞమున కర్హముఁ గానిదియైన భోజనము ఇష్టమైయుండును.

**శ్లో. అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్యమే వేతి మన స్సమాధాయ స సాత్త్వికః ॥ 11**

*తే.గీ.* *శాస్త్రసమ్మత మగుటచే స్వాంతమందు*
*సంతసంబులు నిండ నిస్స్వార్థముగను*
*ప్రతిఫలముఁ గోరనటువంటివారు చేయు*
*యజ్ఞ మది సాత్త్వికంబైన యజ్ఞ మగును.*

**తాత్పర్యము :-** శాస్త్రవిధి ప్రకారము చేసి తీరవలయునను స్థిర సంకల్పముతో, శ్రద్ధతో, ఫలకాంక్ష యే మాత్రమును లేక చేయబడు యాగము సాత్త్వికమని చెప్పఁబడును.

**శ్లో. అభిసంధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12**

**శ్లో. విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్ ।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13**

*తే.గీ.* *ప్రతిఫలాపేక్షతోడ దంభమ్ముతోడ*
*సలుపఁబడు యజ్ఞ మది రాజసంబటండ్రు*
*శాస్త్రవిధిలేక భక్తియు శ్రద్ధలేక*
*దక్షిణలు నీక యన్నప్రదాన మీక*
*మంత్రములు లేక స్వార్థమా మదిని జేయు*
*యజ్ఞ మయ్యది తామస యజ్ఞ మండ్రు.*

**తాత్పర్యము :-** ఓ భరతకులశ్రేష్ఠా ! ఫలాపేక్షచేతను, ఎక్కువ ప్ర గడింపవలెనను కోరికతోను చేయఁబడు యజ్ఞము రాజసమని తెలి వలయును. శాస్త్రమున చెప్పఁబడినదానికి విపరీతమైనది, శ్రద్ధలే: మంత్రములుగాని, దక్షిణలుఁగాని లేనిది, 'అన్నదానము' అనుమాట లేకు చేయఁబడిన యజ్ఞము 'తామసయజ్ఞ'మని చెప్పఁబడును.

శ్లో. దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

తే.గీ. బ్రహ్మనిష్ఠుల, గురుల, దేవతల, ప్రాజ్ఞ
జనులఁ బూజించుటయును శౌచమును గలిగి
త్రికరణంబుల సంశుద్ధి తేజరిల్ల
బ్రహ్మచర్య మహింసలు వదలకుంట
ధరణిలోన శారీరక తపము పార్థ !

**తాత్పర్యము :-** దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, విద్వాంసు పూజించుట; బాహ్యాభ్యంతరములందు శుచిత్వమును పాటించు కుటిలత్వము లేకుండుట, బ్రహ్మచర్యపాలనము, అహింస పాటించుటయు, శరీర సంబంధమైన తపస్సు అని తెలియనగును.

**విశేషార్థము :-** 'బ్రహ్మచర్య'మనగా పువ్వులు, చందనము, వ: మొదలగునవి కోరకుండుట.

శ్లో. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 1

తే.గీ. పరుల నొప్పించు మాటలు పలుకకుండ
సత్యమున్ ప్రియ, హిత సుభాషణము విడక
వేదమంత్రము ప్రణవము విడువకుంట
భవ్యమగు వాక్తపంబని పలుకవలయు.

**తాత్పర్యము :-** ఇతరుల మనస్సును నొప్పింపకుండ మాటలాడు: సత్యమును పలుకుట, ప్రియహితమును బోధించుట, ఎల్లప్పుడు వేదముల చదువుట వాచికతపస్సు అనబడును.

**శ్లో. మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।**
**భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే ॥ 16**

*తే.గీ. నిర్మలంబైన మన సాత్మనిగ్రహంబు*
*మౌనమును భావశుద్ధి సౌమ్యత్వమరయ*
*మానసిక భవ్యతపమంచు జ్ఞానులంద్రు*
*భరతవంశ పవిత్ర ! ఓ పాండుపుత్ర !*

**తాత్పర్యము :-** మనస్సును ప్రసన్నముగా నుంచుకొనుట, మృదు స్వభావము( గలిగియుండుట, మితభాషిత్వము, మనస్సును నిగ్రహించుట, చెడుతలంపులు మనసున జొరనీయకుండుట, మానసమగు తపస్సని చెప్ప(బడు చున్నది.

**శ్లో. శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః ।**
**అఫలాకాఙ్క్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే ॥ 17**

*తే.గీ. ధరణి నిష్కామకర్మ లుత్తములునైన*
*ధ్యానయోగులు పరమ శ్రద్ధాళు లగుచు*
*సలుపు త్రివిధంబులౌ తపస్సులను మేల్మి*
*సాత్త్విక తపస్సులందురు సవ్యసాచి !*

**తాత్పర్యము :-** అధికమైన శ్రద్ధతోను, ఇంద్రియ నిగ్రహముతోను ఫలమును గోరకుండ( జేయు పై మూ(డు విధములగు తపస్సులను సాత్త్విక తపస్సులని చెప్పుదురు.

**శ్లో. సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్ ॥ 18**

*తే.గీ. పూజలంద(గ, సత్కారములను మఱియు*
*గౌరవము లంద( గోరి లోకమున దంభ*
*మునకునై చేయు తపము పేర్కొనగ నస్థి*
*రంబగు నది ధనంజయా ! రాజసంబు.*

**తాత్పర్యము :-** పొగడ్తల నందుటకు, గౌరవాదులను పొందుటకు, దంభముతో( జేసెడి తపస్సును రాజసతప మని చెప్పుదురు. అది ఎప్పుడో యొకప్పుడు మాత్రమే ఫలము నిచ్చును. స్థిర మైనట్టిది గాదు.

**శ్లో. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।**
**పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥ 19**

*తే.గీ. పర వినాశముఁ గాంక్షించి పట్టుదలతొ*
*తన శరీరముఁ బీడించుకొనియునైన*
*మూర్ఖతను సలిపెడి తపంబులను పార్థ!*
*తామసతపస్సులని యంద్రు ధర్మవిదులు.*

**తాత్పర్యము :–** వివేకములేని పట్టుదలతో తన శరీరాదులకు కీడు గలుగునట్లు చేయు తపము తామసము. పరులను నాశనము చేయుటకై చేయు తపస్సు తామసమే.

**విశేషార్థము :–** తపస్సులో గల భేదములు ఇంతవఱకు చెప్పఁ బడినవి.

**శ్లో. దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥ 20**

*తే.గీ. దేశ కాల పాత్రాదుల తీరుఁ దెలిసి*
*మరల ప్రత్యుపకారంబు మనకుఁ జేయ*
*శక్తిలేనట్టి వారి కొసంగు నట్టి*
*దానమును ఋషుల్ సాత్త్వికదాన మంద్రు.*

**తాత్పర్యము :–** 'ఇవ్వఁదగినది' అనెడి నిశ్చయముతో దేశకాలపాత్రముల నెఱిగి గ్రహించువారివలన నెట్టి ఉపకారమును కోరక చేయు దానమును 'సాత్త్వికదాన' మందురు.

**విశేషార్థము :–** 'దేశ'మనఁగా పుణ్యక్షేత్రము. 'కాలమ'నఁగా సంక్రాంతి మొదలగు పుణ్యకాలము. 'పాత్రత' యనఁగా ఆ దానము పొంద నావశ్యకతఁ గలిగియుండుట.

**శ్లో. యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21**

తే.గీ. *జగతి ప్రత్యుపకారవాంఛలను గాని*
*ఫలముఁ గోరియుఁ గాని భావంబునందు*
*సమ్మతము లేక చేయంగ సాగునట్టి*
*దానమును బుధుల్ రాజసదాన మంద్రు.*

**తాత్పర్యము :-** ఫలము నపేక్షించి గాని, గ్రహించువారివలన ప్రత్యుపకారమును గోరి గాని,మనసున బాధపడుచుఁ గాని యిచ్చిన దానము 'రాజసదాన'మని గ్రహింపవలెను.

**శ్లో. అదేశ కాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే ।**
**అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్ ॥ 22**

తే.గీ. *అర్హమే గానిచోట, ననర్హమైన*
*సమయమందు పాత్రులకు ననత్కృతముగ*
*మది తిరస్కార భావంబు లొదవఁ జేయు*
*దానమును బుధుల్ తామసదాన మంద్రు.*

**తాత్పర్యము :-** దేశకాల పాత్రముల నెఱుగకుండఁ జేయునది, యోగ్యులైనవారికి పాదప్రక్షాళనాది గౌరవము లేకఁగాని, అవమాన పూర్వకముగాఁ గాని చేయునదియగు దానము 'తామసదానము' అనఁబడును.

**శ్లో. ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః ।**
**బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥ 23**

తే.గీ. *తగ పరబ్రహ్మమునకు 'ఓం' 'తత్తు' 'సత్తు'*
*లనఁగ వెలసెను మూఁడు పే ర్లవనిలోన*
*బ్రహ్మమే వేద, యజ్ఞ, సద్బ్రాహ్మణులను*
*వెలయఁ జేసె సృష్ట్యాదిలో వినుము విజయ !*

**తాత్పర్యము :-** ఉత్తమములైన ఓం, తత్, సత్ - అను మూఁడు నామములచే పిలువఁబడుచున్నది పరబ్రహ్మము. ఆ త్రివిధనిర్దేశముచేతను సృష్టి మొదటిలో వేదములు, యజ్ఞములు, బ్రాహ్మణులు సృష్టింపఁబడిరి.

**శ్లో. తస్మా దో మిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।**
**ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్ ॥ 24**

*తే.గీ. వేదముల విధింపఁబడిన వినుత కర్మ*
*లయిన యజ్ఞదానతపస్సు లనెడు వాని*
*నాచరింపంగ గడఁగిన యపుడు మొదట*
*పలుకుచుంద్రు 'ఓం'కారమే బ్రహ్మవిదులు.*

**తాత్పర్యము :-** కావుననే శాస్త్రోక్తములైన యజ్ఞములు, దానములు, తపములు చేయునపుడు మొదట 'ఓం' అను పదమునే బ్రహ్మవాదులు పలుకుచుందురు.

**శ్లో. త దిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః ।**
**దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః ॥ 25**

*తే.గీ. మోక్షవాంఛితు లిల ఫలాపేక్షలేక*
*తపము యజ్ఞము దానముఁ దాము చేయు*
*నట్టి సమయమునందు 'తత్' అను పదమును*
*శ్రద్ధతో నుచ్చరింతురు సవ్యసాచి !*

**తాత్పర్యము :-** మోక్షకాములైనవారు ముందుగా 'తత్' అను పదము నుచ్చరించి ప్రతిఫలాపేక్ష లేక తాము చేయు యజ్ఞ దాన తపములను ప్రారంభింతురు.

**శ్లో. సద్భావే సాధు భావే చ సదిత్యేత త్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ ! యుజ్యతే ॥ 26**

*తే.గీ. బ్రహ్మ మది శ్రేష్ఠ మనియుఁ శాశ్వతము ననియు*
*పలుకుట కయి 'సత్' శబ్దము వాడఁబడును*
*శ్రేష్ఠ మయినట్టి కర్మలన్ జేయునపుడుఁ*
*గూడ 'సత్' శబ్ద మయ్యది వాడఁబడును.*

**తాత్పర్యము :-** 'సత్' అను పదమునకు 'కలదు' అనియొక అర్థమును, 'మంచి' అను నింకొక అర్థమును గలదు. కావున అన్ని శుభకర్మలయందును 'సత్' అను పదమునే బ్రహ్మజ్ఞులు వాడుదురు.

**విశేషార్థము :-** ఉత్తమములగు వస్తువులును, కర్మలును బ్రహ్మ స్వరూపములే.

**శ్లో. యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।**
**కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే ॥ 27**

*తే.గీ. యజ్ఞమున తపస్సున దానమందు నున్న*
*నిష్ఠబిలుతురు 'సత్'పేర నిపుణమతులు*
*పొసగ దేవతాప్రీత్యర్థముగను బుధులు*
*చేయు కర్మలు 'సత్' పేరఁజెప్పఁబడును.*

**తాత్పర్యము :-** యజ్ఞదాన తపములందు నిష్ఠ గలిగియుండుటను గూడ 'సత్' అనియే చెప్పుదురు. యజ్ఞదానతపము లన్నియు యజ్ఞపురుషుని ప్రీతికొఱకే చేయఁబడుచున్నవి. కావున వానినిగూడ 'సత్' అని చెప్పనగును.

**శ్లో. అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్ ।**
**అస దిత్యుచ్యతే పార్థ ! న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28**

*తే.గీ. శ్రద్ధ లేనట్టి వారలు సలుపునట్టి*
*యజ్ఞదాన తపంబులు నన్ని కర్మ*
*లరయఁగ నసత్తులే గాన నట్టివారి*
*కిహ పర సుఖంబులందు లేదేదిగూఢ*
*భరతవంశపవిత్ర ! ఓ పాండుపుత్ర !*

**తాత్పర్యము :-** శ్రద్ధలేనివారిచేఁ జేయఁబడిన యజ్ఞదానతపములు మూఁడును 'అసత్తులు', అవి ఈ లోకమునఁగాని, చచ్చిన తరువాతఁ గలుగు పరలోకమునఁగాని సుఖములు గలిగింపలేవు. అనఁగా శ్రద్ధ లేనిదే ఫలము రాబోదని భావము.

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
శ్రద్ధాత్రయ విభాగ యోగంబను
పదునేడవ అధ్యాయము సంపూర్ణము.
'ఓం తత్ సత్'



శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥
(18-78)

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడును, గాండీవమును దాల్చిన అర్జునుడును ఏ పక్షమున నుందురో ఆ పక్షమున (పాండవపక్షమున) లక్ష్మియు, నీతియు, ఐశ్వర్యమును, విజయమును నిశ్చయముగ నుండునని నా మనస్సు నాకు తెలుపుచున్నది.



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర భగవద్గీత

## శ్రీమద్ భగవద్గీతాయాం అష్టాదశోఽధ్యాయః

## మోక్ష సన్న్యాస యోగము

*అర్జున ఉవాచ :-*

**శ్లో. సన్న్యాసస్య మహాబాహో ! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్ ।**
**త్యాగస్య చ హృషీకేశ ! పృథ క్కేశినిషూదన !** 1

*తే.గీ. అనిన శ్రీకృష్ణుఁ గాంచి యర్జున్నుఁడు పలికె*
*స్వామి ! కేశినిషూదనా ! భక్తపాల !*
*వర హృషీకేశ ! శుభ మహాబాహు ! తండ్రి !*
*తనర సన్న్యాస త్యాగాల తత్త్వములను*
*వేరు వేరుగఁ దెలుపంగ వేడుకొనెద.*

**తాత్పర్యము :-** 'కేశి' రాక్షసుని జంపిన ఓ కృష్ణా ! ఇంద్రియములను నియమస్థితిలో నుంచువాఁడా ! సన్న్యాసము, త్యాగము అను రెండు శబ్దముల యొక్క అర్థ విశేషమును, దాని తత్త్వమును వివరముగాఁ దెలిసికొనఁగోరు చున్నాను.

**విశేషార్థము :-** శ్రీకృష్ణుని ఉపదేశము ముగిసిన పిదప తన కేమి చేయుటకును పాలుపోక, యుద్ధము చేయుట కిచ్ఛ గలుగక పైవిధముగాఁ బ్రశ్నించెను.

*శ్రీభగవా నువాచ :-*

**శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।**
**సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః ॥** 2

*తే.గీ. అనుచు నడిగిన ఫల్గును గనుచు నపుడు*
*మాధవుండనె; కామ్య కర్మముల వదల*
*వసుధ సన్న్యాస మని యంద్రు ప్రాజ్ఞు లెపుడు*
*సర్వ కర్మఫలాల నాసక్తి వీడ*
*త్యాగ మని యందు రర్జునా ! తత్త్వవిదులు.*

**తాత్పర్యము :–** కామ్య కర్మములైన అశ్వమేధాదులను చేయకుండుట (అనగా శాస్త్రములు తప్పక అనుష్ఠించవలసినవని చెప్పబడినవి మాత్రమే చేయుట) సన్న్యాస మనియు, నిత్యనైమిత్తిక కర్మలను చేయుచు ఫలమును త్యజించుట త్యాగ మనియు వివేకులు చెప్పుదురు.

**శ్లో. త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః ।**
**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే ॥** 3

*తే.గీ. సకల కర్మలు గలదు దోషం బదేదొ*
*అనుచు విడువంగవలెనని యంద్రు బుధులు*
*యజ్ఞదాన తపఃకర్మ లవనిలోన*
*వీడరాదని కొందరు విజ్ఞు లంద్రు.*

**తాత్పర్యము :–** కొందఱు వివేకులు బంధకములగుటచే అన్ని కర్మలను దోషములను వలె విడువదగునని పలుకుదురు. ఇంక కొందఱు యజ్ఞ, దాన, తపో రూపములగు కర్మలను విడువదగదని చెప్పుదురు.

**విశేషార్థము :–** (1) నిత్యకర్మలను మానక, శాస్త్రములో చెప్పబడినను అశ్వమేధాది కామ్యకర్మలను చేయకుండుట.

(2) సర్వవిధ వైదిక కర్మలను చేయుచు ఫలమును విడచుట.

(3) సర్వ కర్మలను త్యజించుట.

(4) యజ్ఞ దాన తపోరూప కర్మలను త్యజింపకుండుట – ఈ నాలుగు పద్ధతులును పైన చెప్పబడినవి.

**శ్లో. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ !**
**త్యాగో హి పురుషవ్యాఘ్ర ! త్రివిధః సంప్రకీర్తితః ॥** 4

*తే.గీ. వినుత గుణగణ్య ! త్యాగమన్ విషయ మందు*
*విను యథార్థము నేను తెల్పెదను నీకు*
*సాత్త్వికము, రాజసము, తామసంబటంచు*
*త్యాగ మది మూఁడు విధములఁ దనరు పార్థ !*

**తాత్పర్యము :-** భరతవంశములో ఉత్తముఁడవు, పురుష శ్రేష్ఠుఁడవగు ఓ అర్జునా ! నీవు ప్రశ్నించిన వానిలో త్యాగమును గూర్చి నా నిశ్చితాభిప్రాయమును తెలిపెదను, వినుము. 'త్యాగము' మూఁడు విధములని వర్ణింపఁబడినది.

**విశేషార్థము :-** పై నాల్గింటిలో ఉత్తమమైన దానిని వివరింపఁబోవుచున్నాఁడు.

**శ్లో. యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్య మేవ తత్ ।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥** 5

*తే.గీ. యజ్ఞదాన తపంబు లీ యవనియందు*
*వదలకను నాచరింపంగవలయు నెపుడు*
*యజ్ఞ దాన తపోరూపమైన కర్మ*
*పావనం బౌను భావింప ప్రాజ్ఞులకును.*

**తాత్పర్యము :-** యజ్ఞ దాన తపము లను మూఁడు కర్మలును విడువఁదగినవి గావు. తప్పక ఆచరింపఁదగినవి. ఫలముఁ గోరనివారికి ఆ యజ్ఞ దాన తపములు చిత్తశుద్ధికిఁ గారణము లగుచున్నవి.

**శ్లో. ఏతా న్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।**
**కర్తవ్యా నీతి మే పార్థ ! నిశ్చితం మత ముత్తమమ్ ॥** 6

*తే.గీ. అరయ నీ కర్మ లెల్ల ఫలాభిలాష*
*వదలి చేయంగఁ దగిన విష్వసుధయందు*
*ఉత్తమం బైన ధర్మ మిదౌ నటంచు*
*నేను నుడివెద వలునా ! నిశ్చయముగ.*

**తాత్పర్యము :-** అయినను యజ్ఞ దాన తపము లను త్రివిధ కర్మ సంగములేక, ఫలమును వదలి ఆచరింపఁదగునని నేను తలంచెదను. అది ఉత్తమమత మని నా నిశ్చయము.

**శ్లో. నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే ।**
**మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥**

*తే.గీ. వేద శాస్త్రార్థ నియతమై వెలయునట్టి*
*కర్మలు త్యజించుటది మంచి గాదు విజయ !*
*కాని యవివేకమున నట్టి కర్మములను*
*త్యాగముం జేయ తామస త్యాగ మండ్రు.*

**తాత్పర్యము :-** ఆచరింపఁదగిన నిర్ణీత కర్మల నెవ్వరును విడువరా అజ్ఞానముతో ఎవ్వరైనను అటువంటి కర్మలను వదలినచో వారి త్యాగమ తామస త్యాగ మని చెప్పుదురు.

**శ్లో. దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥**

*తే.గీ. కాయ కష్టంబు భరియింపఁ గాదటంచు*
*కర్మములు త్యాగ మొనరింపఁ గడఁగు వాని*
*త్యాగ మెన్నంగ రాజస త్యాగ మగును*
*అట్టివాఁ డందుకోలేడు త్యాగఫలము.*

**తాత్పర్యము :-** శరీరానికి కష్టము కలుగునను భయముతోఁగ దుఃఖాన్ని కలిగించునని గాని కర్మను మానినట్లయిన అట్టి త్యాగమ రజోగుణ సంబంధమైన త్యాగ మని చెప్పెదరు. అట్టి త్యాగమునకు ఫల లేదు.

**శ్లో. కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !**
**సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః ॥**

*తే.గీ. శాస్త్రసమ్మతకర్మముల్ సలుపఁ దగిన*
*కర్మము లటంచు ఫలము సంగమ్ము విడచి*
*చేయఁబడునేని తత్త్వ ప్రసిద్ధు లెల్ల*
*దానినే మేల్మి సాత్త్విక త్యాగ మండ్రు.*

**తాత్పర్యము :-** అర్జునా ! నిత్యములు, నైమిత్తికములు అగు కర్మలు తప్పక చేయవలసినవని యెంచి చేయుచు, సంగమును ఫలమును వదలుట సాత్త్వికత్యాగ మనఁబడును.

**శ్లో. న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।**
**త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10**

*తే.గీ. సత్త్వగుణుఁ డైన త్యాగి సంశయము లేదలి*
*ప్రాజ్ఞుఁడగుచును సంసార బంధకార*
*ణమగు కర్మను ద్వేషింపఁ, డమిత సుకర*
*కర్మములయందు నాసక్తి గాంచఁ బోఁడు.*

**తాత్పర్యము :-** సంగమును, ఫలమును వదలి కర్మలు చేయుచు సత్త్వగుణము వృద్ధిచెందఁగా ఆత్మజ్ఞాన లక్షణమైన ప్రజ్ఞను పొంది, సంశయ రహితుఁడైనవాఁడు సంసారకారణ మని కామ్యకర్మను ద్వేషింపడు. సత్త్వశుద్ధి గలిగించి జ్ఞానహేతు వగునని నిత్యకర్మమునందు ప్రీతిని పొందదు.

**శ్లో. న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః ।**
**యస్తు కర్మఫలత్యాగీ స త్యా గీత్యభిధీయతే ॥ 11**

*తే.గీ. కర్మముల నెల్ల త్యజియింపఁ గాదు పార్థ !*
*దేహధారుల కెల్ల పృథ్వి న్నిజముగ,*
*కర్మ ఫలములఁ ద్యజియింపఁ గడఁగువాఁడె*
*త్యాగియని చెప్పఁబడుచుండు ధన్యుఁ డతఁడు.*

**తాత్పర్యము :-** దేహధారికి (అనగా దేహమే 'ఆత్మ'యని తలంచి అభిమానించువానికి) కర్మల నన్నిటిని విడచుట వీలు కాదు గదా ! ఫలాపేక్ష లేకుండ ఎవ్వడు నిత్యకర్మల నాచరించునో అతనినే 'త్యాగి' అని అందురు.

**శ్లో. అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।**
**భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12**

*తే.గీ. జగతియం దిష్టమును సనిష్టంబు మఱియు*
*మిశ్రమని కర్మఫలములు మేల్మి వెలయు,*
*త్యాగి బొందదు వీని, జన్మాంతరమున*
*త్యాగి గానట్టి వాఁడొందుఁ దప్పకుండ.*

**తాత్పర్యము :-** ఇష్టము, అనిష్టము, మిశ్రము - అను మూఁడు విధములుగా కర్మఫలము లుండును. త్యాగము చేయనివారలకు ఈ మూఁడు ఫలములును మరణానంతరము కలుగును. పరమార్థమగు సన్న్యాసమును గావించిన వారలకు ఈ మూఁడు ఫలములును ఎప్పుడును చెందవు.

**శ్లో. పఞ్చైతాని మహాబాహో ! కారణాని నిబోధ మే ।**
**సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ 13**

*తే.గీ. సకల కర్మల సిద్ధి కీ జగతిలోన*
*సాంఖ్య శాస్త్రంబునందు ప్రశస్తముగను*
*తెలుపఁబడిన కారణము లైదింటి నిపుడు*
*తెలిపెదను నీకు వినుము సందియము దీరు.*

**తాత్పర్యము :-** అర్జునా ! కర్మలెందు పరిసమాప్తి నొందునో అట్టి సాంఖ్యమందు (జ్ఞానమునందు) సర్వకర్మల సంసిద్ధికై బాగుగా నిర్ణయింపఁబడిన కారణములను ఐదింటిని తెలిపెదను. తెలిసికొమ్ము.

**శ్లో. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।**
**వివిధాశ్చ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్ ॥ 14**

*తే.గీ. వెలయ దేహంబుఁ గర్తయు వివిధములగు*
*కరణములుఁ జేష్టలున్ దైవ మరయ నైదు*
*కర్మసిద్ధికి గల యట్టి కారణములు*
*వ్రాయఁబడె నిట్లు సాంఖ్యశాస్త్రంబునందు.*

**తాత్పర్యము :-** కర్మసిద్ధికి సాంఖ్యయోగమునఁ జెప్పఁబడిన కారణములు ఐదు. (1) దేహము (2) కర్త (3) పండ్రెండు ఇంద్రియములు (4) వివిధ చేష్టలు (5) అన్నిటికంటె ముఖ్యమైనది దైవము.

**విశేషార్థము :-** 'అధిష్ఠానమ్' - అను దానివలన ఇచ్ఛ, ద్వేషము, సుఖ దుఃఖములు, జ్ఞానము మొదలగు గుణముల కాధారమగు శరీరమని గ్రహింపవలయును.

**శ్లో. శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః ।**
**న్యాయం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః ॥ 15**

*తే.గీ. మనసుచేతను వాక్కుచే తనువుచేత*
*నరుఁ డొనర్చెడు న్యాయ మన్యాయమైన*
*కర్మము లవెవ్వి యయిన నిక్కంబుగాఁగ*
*కారణము లవ్వి యయిదెయౌ ఖండితముగ.*

**తాత్పర్యము :-** అర్జునా ! మానవుఁడు తన మనస్సుచే, వాక్కుచే, శరీరముచేఁ జేయు సర్వ కర్మలకును అవి న్యాయమైన వైనను, అన్యాయమైన వైనను పైన చెప్పినవే కారణములని గ్రహింపుము.

**విశేషార్థము :-** న్యాయములనగా శ్రుతిస్మృతులచే విధింపఁబడినవి. అన్యాయములనఁగా వానిచే నిషేధింపఁబడినవి; సత్పురుషులచే నిందింపఁబడినవి.

అయిదు కారణములలోను నాల్గింటికంటె మిక్కిలి బలవత్తరమైనది దైవము.

**శ్లో. తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।**
**పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః ॥ 16**

*తే.గీ. కర్మమున కిట్టు లుండఁగా కారణములు*
*ఆత్మనే కర్తగా నెంచునట్టివాఁడు*
*శాస్త్ర సంస్కార హీన దుశ్చరిత చిత్తుఁ,*
*డతఁడు నిజమైన కర్తనే యరయ లేడు.*

**తాత్పర్యము :–** కర్మ సంసిద్ధికి పైన చెప్పిన కారణము లైదుండగా శాస్త్ర సంస్కారము లేనందున మూఢులు కర్మమునకు తామే కర్తలమని అహంకారమున దలఁచుచు పరమార్థమును ఎఱుగఁజాలరు.

**శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే ।**
**హత్వాఽపి స ఇమా న్లోకాన్ హన్తి న నిబధ్యతే ॥ 17**

*తే.గీ. కనగ నేనను భావ మెవ్వనికి లేదొ*
*కర్మఫలముల నాసక్తిగాంచఁ డెవఁడొ*
*జగతి నాతఁడీ జనులను జంపిగూడ*
*బద్ధుఁడును గాడు చంపినవాఁడుఁ గాడు.*

**తాత్పర్యము :–** కర్మఫలములను గూర్చి అహంకారభావము (కర్తృత్వ, భోక్తృత్వముల గురించిన భావము) లేనివాఁడును, అంతఃకరణమున విషయములందు ఏ మాత్రము ప్రవేశము లేనివాఁడును నైన విద్వాంసుఁడు కంటికి కనబడు ఈ ప్రాణులను (యుద్ధమున నున్నవారిని) చంపినను గూడ ఆ కర్మ ఆతనిని బాధింపదు; బంధించదు. అతఁడు చంపినవాఁడు కాడు.

**విశేషార్థము :–** ఉష్ణము మఱియు ప్రకాశము అగ్నిని బంధింపలేనట్లు ఆత్మస్వరూపము నెఱిగినవారు తాముగా చేయు కృత్యములే యుండవు.

**శ్లో. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ 18**

*తే.గీ. జ్ఞాన మని జ్ఞేయ మని పరిజ్ఞాత యనుచు*
*తనర త్రివిధముల్ కర్మచోదనము లరయ*
*కరణ మని కర్మ మనియును గర్త యనుచుఁ*
*గర్మమునకును త్రివిధముల్ గలవు పార్థ !*

**తాత్పర్యము :–** కర్మములను నడిపించుటలో జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత అను మూఁడింటి ప్రమేయము అధికముగాఁ గలదు. ఈ

మూఁడింటిలో నేది లోపించినను శాస్త్రమునకు లోపమే. అట్లే ఒక కర్మను ప్రారంభించుటకు కరణము, కర్మ, కర్త అను మూఁడును ఆవశ్యకములే.

**విశేషార్థము :-** జ్ఞానము-సర్వ విషయములను దెలిసికొనుటకు సాధనము.
జ్ఞేయము-తెలిసికొనఁబడు విషయము.
పరిజ్ఞాత-దేహస్వరూపములో సాక్షియైనవాఁడు.

**శ్లో. జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।**
**ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి ॥ 19**

*తే.గీ. జ్ఞానమును కర్మ కర్తయు శాస్త్రగతిని*
*త్రివిధముల నొప్పు సత్త్వాది త్రిగుణములను*
*వీని శాస్త్రానుసారమ్మ విపులముగను*
*వివరణ మొనర్తు వినుము సద్వినుతతేజ !*

**తాత్పర్యము :-** పైన జెప్పిన జ్ఞానము, కర్మ, కర్త - అను మూఁడును కపిల మహర్షి సాంఖ్య యోగమునందు సాత్త్వికాది గుణభేదములవలన మూఁడు విధములుగాఁ జెప్పఁబడుచున్నవి.

**శ్లో. సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే ।**
**అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥ 20**

*తే.గీ. సర్వభూతంబులందు ప్రశస్తి నొప్పి*
*అవ్యయం బయి యవిభక్తమగుచు నొప్పు*
*ఆ పరబ్రహ్మమును గాంచునట్టి వాని*
*జ్ఞాన మొక్కటే సాత్త్వికజ్ఞాన మగును.*

**తాత్పర్యము :-** దేహములు భేదములయిన కారణమున వేఱువేఱుగాఁ దలపబడెడి అన్ని భూతములలోను నాశనములేక వేఱుచేయఁబడక ఒక్కటిగా వెలిగెడి ఆత్మను తెలిసికొనఁగలిగిన జ్ఞానమును సాత్త్వికజ్ఞాన మని చెప్పెదరు.

**శ్లో. పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।**
**వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్ ॥ 21**

తే.గీ. సకల భూతంబులందును ప్రకటితముగ
వేఱు వేఱు రూపంబుల వెలయుచుండు
ఆ పరబ్రహ్మమని యెంచునట్టి వాని
జ్ఞాన మయ్యది రాజస జ్ఞాన మగును.

**తాత్పర్యము :-** వివిధములైన ప్రాణికోటియందున్న ఆ పరబ్రహ్మమును వేఱు వేఱు రూపములు గలవానినిగా దలంచు జ్ఞానమును రాజసమైన జ్ఞానమని భావింతురు.

**శ్లో. యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్ ।**
**అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్ ॥ 22**

తే.గీ. మహిని యొకదానియందె సమస్తమున్న
కల దటంచెంచి మనసందె నిలిపి, చెలగు
తత్త్వ మరయక స్వల్పతన్ దనరు నట్టి
జ్ఞాన మది యెంచ తామస జ్ఞాన మగును.

**తాత్పర్యము :-** నిజము కానిది, తత్త్వమునకు నిలువనిది, తత్త్వముకంటె భిన్నమైన యొక అల్ప వస్తువునందు స్వల్ప ఫలము నాశించి జగత్పూర్ణని భావించునట్టి మూర్ఖమగు అభినివేశము (ప్రవేశము)నకు తామస జ్ఞాన మని పేరు.

**శ్లో. నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్ ।**
**అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే ॥ 23**

తే.గీ. శాస్త్ర సమ్మత మౌచు, నానక్తి లేక
రాగమున్ ద్వేషమున్ లేక ప్రతిఫలంబు
నాశపడకుండ జేసెదు నట్టి మంచి
కర్మ యయ్యది సాత్త్విక కర్మ యగును.

**తాత్పర్యము :-** ఫలాపేక్షకుండా, రాగద్వేషములుగాని, సంగముగాని లేక ఎల్లప్పుడు తప్పక చేయు శాస్త్రవిహిత కర్మమును సాత్త్వికమగు కర్మయని ధర్మజ్ఞులు చెప్పుదురు.

**శ్లో. యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।**
**క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥ 24**

*తే.గీ. కడు నహంకారయుతుఁ డైన కర్తచేత*
*ప్రతిఫలాపేక్ష తోడ హృద్భావమందు*
*ప్రియము లేకుండ విధిలేని రీతిఁ జేయు*
*కర్మ యయ్యది రాజస కర్మ యగును.*

**తాత్పర్యము :-** ఫలాపేక్షతో, అహంకారముతోఁ గూడుకొనిన కర్తచే చేయఁబడి, అధికమగు శ్రమను కలుగఁజేయు కర్మను రాజస కర్మయని కర్మవిదులు చెప్పుదురు.

**శ్లో. అనుబద్ధం[1] క్షయం హింసా మనపేక్ష్య [2]చ పౌరుషమ్ ।**
**మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే ॥ 25**

*తే.గీ. కలుగఁ బోయెడు నటువంటి కష్ట నష్ట*
*ములను నెంచకఁ దన శక్తి దలఁచకుండ*
*అజ్ఞుఁ డగువాఁడు తాను చేయంగఁ బూను*
*కర్మ యయ్యది తామస కర్మ యగును.*

**తాత్పర్యము :-** మేలు కీళ్ళను గాని, సులువు బరువులనుగాని, ప్రాణిపీడనమును గాని, పౌరుషమునుగాని యోచింపకుండ అవివేకముచే చేయఁబడు కర్మను తామస మగు కర్మ యని యందురు.

**శ్లో. ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।**
**సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26**

*తే.గీ. భువి నహంకారమును వీడి ముక్తసంగుఁ*
*డగుచు ధైర్య ముత్సాహంబు నలరుచుండ*
*సిద్ధ్యసిద్ధుల మనసును చెదరనీని*
*కర్త యగువాని సాత్త్వికకర్త యండ్రు.*

---

[1] అనుబంధమ్ [2] అనవేక్ష్య – పాఠాంతరములు

**తాత్పర్యము :-** సాత్త్విక కర్త అనగా కర్మఫలాపేక్షను వదలి, అహంభావము లేక, ధైర్యమును ఉత్సాహమును గలిగి కార్యములు ఫలించినను, ఫలింపకున్నను రాగద్వేషములను పొందక శాస్త్ర ప్రమాణానుసారము కర్మల నాచరించు కర్తను సాత్త్వికుఁ డందురు.

**శ్లో. రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।**
**హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥** 27

*తే.గీ. అవని ననురాగి కర్మఫలాభిలాషి*
*అశుచి లుబ్ధుఁడు హర్షశోకాన్వితుండు*
*మఱియు హింసాత్మకుం డౌచు వరలు నట్టి*
*కర్త యగువాని రాజస కర్త యంద్రు.*

**తాత్పర్యము :-** కర్మఫలములను గోరుచు రాగముఁగలవాఁడై, లుబ్ధుఁడును, హింసచేయువాఁడును, అశుచియునై హర్షశోకములకు లోనగుచు కర్మలను జేయు కర్తను రాజస కర్త యని యందురు.

**శ్లో. అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।**
**విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥** 28

*తే.గీ. మనసు నిలుకడలేని సోమరియు శఠుఁడు*
*ప్రాకృత గుణాన్వితుఁడు సదావ్యసనపరుఁడు*
*తగు సమర్థతయును నమ్రతయును లేని*
*కర్త యగువాని తామస కర్త యంద్రు.*

**తాత్పర్యము :-** స్థిరచిత్తము లేనివాఁడును, సోమరియు, బుద్ధి సంస్కారము లేనివాఁడును, మోసగాడును, ఇతరుల పనులను చెఱచువాఁడును, ఎల్లప్పుడును క్రుంగిన స్వభావముతోనుండి పనుల నన్నిటిని ఆలస్యముగాఁ జేయువాఁడును, తామసుఁడగు కర్త యని చెప్పఁబడును.

**శ్లో. బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు ।**
**ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ !** 29

*తే.గీ.* *బుద్ధియును ధైర్యమును గాంచ మువ్విధములు*
*సత్త్వము రజమ్ము తమ మన సాగునట్టి*
*మూఁడు విధములు గుణభేదములను పార్థ!*
*వాని వివరింతు విశదంబుగాను వినుము.*

**తాత్పర్యము :–** అర్జునా ! బుద్ధి ధైర్యములు కూడ సాత్త్విక, రాజస, తామసములను త్రిగుణములచే మూఁడు విధములుగాఁ జెప్పఁబడినవి. వానిని నీకు విపులముగాఁ దెలియఁజెప్పెదను వినుము.

**శ్లో.** **ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ ! సాత్త్వికీ ॥** 30

*తే.గీ.* *తమి ప్రవృత్తి నివృత్తి మార్గముల నెఱిఁగి*
*పొసఁగ కార్యమును నకార్యముల గ్రహించి*
*బంధమోక్షంబులును భయాభయము లెఱిఁగి*
*భువి వరలు బుద్ధి సాత్త్విక బుద్ధి యగును.*

**తాత్పర్యము :–** కర్మలు చేయుట, వానినుండి మరలుట, చేయఁదగిన దానిని అట్లే చేయఁదగని దానిని, భయముఁ గలిగించుదానిని భయముఁ గలిగింపని దానిని, బంధమును–మోక్షమును తెలిసికొనఁ గలిగిన బుద్ధి సాత్త్వికమైన బుద్ధి యగును.

**శ్లో.** **యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ ।**
**అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ ! రాజసీ ॥** 31

*తే.గీ.* *తనరఁగను నుర్వి ధర్మ మధర్మములను*
*కార్యము నకార్యముల మేల్మిఁ గాంచకుండ*
*మిగుల పొరబాటుగా నెంచఁ దగిన యట్టి*
*బుద్ధి యది చూడ రాజస బుద్ధి యగును.*

**తాత్పర్యము :–** శాస్త్రములలోఁ జెప్పఁబడిన ధర్మమునకును, దానికి విరుద్ధమగు అధర్మమునకును; కార్యమునకును, అకార్యమునకును, యదార్థమగు రూపమును గ్రహింపలేని బుధి రాజస బుధి యగును

**శ్లో. అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసాఽఽవృతా ।**
**సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ ! తామసీ ॥ 32**

తే.గీ. *ధర్మమును గాంచి యుద్ది యధర్మ మనియు*
*తగ నధర్మమున్ పాడఁగాంచి ధర్మ మనియు*
*తారుమారుగ నెంచుచుఁ దనరు నట్టి*
*బుద్ధి యది గాంచ తామస బుద్ధి యగును.*

**తాత్పర్యము :–** అజ్ఞానముచేఁ గప్పబడినదై, అధర్మమగు విషయమును ధర్మముగాను, ధర్మమగు విషయమును అధర్మముగాను, అన్ని విషయములను తాఱుమాఱుగను తలచెడి బుద్ధి తామసబుద్ధి యగును.

**విశేషార్థము :–** పై మూఁడు శ్లోకములందు బుద్ధియందుఁ గల మూఁడు భేదములును తెలుపఁబడినవి.

**శ్లో. ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః ।**
**యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ ! సాత్త్వికీ ॥ 33**

తే.గీ. *మానితముగ ప్రాణేంద్రియ మానసముల*
*వాని వ్యాపారముల నెల్ల భవ్యయోగ*
*సాధనముచేత సన్మార్గసరణి నుంచఁ*
*దగిన ధైర్యము సాత్త్విక ధైర్య మగును.*

**తాత్పర్యము :–** చలింపక, నిగ్రహముచే సర్వేంద్రియములను, ప్రాణమును, మనస్సును, వాని వ్యాపారములను ఒక నియమప్రకారము నడుపఁ గలిగిన ధైర్యమును సాత్త్విక ధైర్యమని చెప్పుదురు.

**శ్లో. యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।**
**ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ ! రాజసీ ॥ 34**

తే.గీ. *ధర్మకామార్థములను నత్యంత మైన*
*ప్రతిఫలాపేక్ష నొప్పు భావంబుతోడ*
*అధిక సంప్రీతి నెరవేర్చునట్టి వాని*
*ధైర్య మరయఁగ రాజస ధైర్య మగును.*

**తాత్పర్యము :-** అర్జునా ! కర్మఫలములయందు కాంక్ష గలిగి ధర్మాదుల నాచరించుటయందలి అనుభవముచే ధర్మకామార్థములను త్రివర్గ ఫలములను ధరింపఁజేయు ధైర్యమును రాజస మగు ధైర్య మని చెప్పుదురు.

**శ్లో. యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ ।**
**న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ ! తామసీ ॥ 35**

తే.గీ. *అధిక మయినట్టి శోకభయంబులున్న*
*మదము నిద్ర విషాదమే మనుజుఁ డెపుడు*
*విడువకను దాల్చు నట్టి వివేకహీను*
*ధైర్య మెన్నఁగ తామస ధైర్య మగును.*

**తాత్పర్యము :-** దుష్టబుద్ధి కాస్పదమైన నిద్రను, భయమును, శోకమును, విచారమును, కావరమును, మొండి ధైర్యమును తామస మగు ధైర్య మని పలుకుదురు.

**శ్లో. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ !**
**అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36**

**శ్లో. య త్తదగ్రే విష మివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్ ॥ 37**

తే.గీ. *తనర సుఖములు మూఁడు విధంబు లరయ*
*వరలు ధ్యానము నభ్యాసబలమువలన*
*ఎందు రమియించుచుండఁగా నిలను గలుగు*
*దుఃఖ మది యెన్నఁ బూర్తిగాఁ దొలఁగు నదియు.*

తే.గీ. *విమలమైనట్టి బుద్ధిచే వెలయఁ బుట్టి*
*ఆది విషముగఁ దోచుచు నంత్య మందు*
*అమృతమయముగ పరిణామమైన యట్టి*
*సుఖమునే మేల్మి సాత్త్విక సుఖ మటంద్రు.*

**తాత్పర్యము :-** అర్జునా ! ఏ సుఖము అభ్యాసమువలన పొందనగునో అది మూఁడు విధములుగా నునది. చూడుము.

నిర్మలమైన బుద్ధిచే పుట్టి మొట్టమొదట విషమువలె తోచినను చిట్టచివరకు అమృతముతో సమానముగాఁ దోచు సుఖము సాత్త్వికము.

**విశేషార్థము :-** జ్ఞానము, వైరాగ్యము, ధ్యానము, సమాధి-ఇవన్నియు ఆరంభములో కష్టసాధ్యములుగాఁ గన్పడినను పరిపక్వమైన పిదప సుఖమును గలిగించును.

**శ్లో. విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥** 38

*తే.గీ. విషయ సుఖముల నింద్రియ వితతి పెనఁగి*
*మొదట నమృతోపమాన్నమై తుదకు నదియె*
*విషమువలె మారి తుదిలేని వెతల ముంచు*
*సుఖమునే బుధుల్ రాజస సుఖ మటంద్రు.*

**తాత్పర్యము :-** విషయములకు - ఇంద్రియములకుఁ గలిగిన సంయోగము వలన మొదట అమృతముతో సమానముగాఁ గన్పించి చివరకు విషముగా పరిణమించు సుఖము రాజసము.

**శ్లో. యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః ।**
**నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్ ॥** 39

*తే.గీ. ఆది యందును నంత్యమునందు, నిద్ర*
*వలనను ప్రమాద మాలస్యములను బుట్టి*
*మదికి సుఖమనే భ్రాంతిని యొదవఁ జేయు*
*సుఖము నరయఁగ తామస సుఖ మటంద్రు.*

**తాత్పర్యము :-** ప్రారంభములోను, కాలక్రమమునను గూఢ వ్యామోహమును గలుగఁజేయు నిద్ర, ఆలస్యము, ప్రమాదము - అను కారణములచేఁ గలిగినట్టి సుఖము తామసము.

**శ్లో. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః ।**
**సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభి ర్గుణైః ॥** 40

తే.గీ. అమరలోకాన దేవతలందుఁగాని
అవనియందలి మనుజులయందుఁ గాని
ప్రకృతి జనితమౌ త్రిగుణసంపర్కమెడలి
తనరువాఁ డొక్కఁడైనఁ బేర్కొనఁగ లేదు.

**తాత్పర్యము :-** స్వర్గమందు గల దేవతలలోఁ గాని, భూమిపైఁ గల మనుష్యులలోఁ గాని, పైన చెప్పిన ప్రకృతి సిద్ధములైన మూఁడు గుణములు లేనివారు ఒక్క రయినను కన్పింపరు.

**విశేషార్థము :-** ముల్లోకములలోఁ గూడ ఏ వస్తువుగాని ప్రకృతిగుణముల నతిక్రమించి కనబడదు.

**శ్లో. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప !**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః ॥** **41**

తే.గీ. బ్రాహ్మణులకును క్షత్రియ వైశ్యులకును
శూద్రులకుఁ గూడ నవనిలో సురుచిరముగ
వారి వారి జన్మాంతర స్వ స్వభావ
గుణములను బట్టి కర్మముల్ కూర్పఁ బడియె.

**తాత్పర్యము :-** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర తెగలవారికి నిర్ణయింపబడిన కర్మలు, వారి వారి ప్రకృతివలన బుట్టిన గుణములను బట్టి విభజింపఁబడినవే. అవి యథేష్ట కల్పితములు గావు.

**శ్లో. శమో దమ స్తపః శౌచం క్షాన్తి రార్జవ మేవ చ ।**
**జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥** **42**

తే.గీ. శమ దమమ్ములుఁ దపము శౌచమ్ము క్షమయు
ఆర్జవ జ్ఞాన విజ్ఞాన మాస్తికతలు
బ్రాహ్మణుల కెన్న ప్రకృతి సంభవ గుణములు
శ్రద్ధగా దీని గ్రహియించు సవ్యసాచి !

**తాత్పర్యము :-** శమము, దమము, తపస్సు, శౌచము, ఓర్పు, సరళత, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము-ఇవన్నియు బ్రాహ్మణులకు స్వభావసిద్ధముగాఁ గలిగిన కర్మలు.

**విశేషార్థము :-** శమము = అంతరింద్రియ నిగ్రహము; దమము = బాహ్యేంద్రియ నిగ్రహము.

**శ్లో. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్ ।**
**దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥** 43

*తే.గీ. శౌర్య ధైర్య సాహసములు శౌచగుణము*
*దాన మీశ్వర భావంబుఁ దనర తేజ*
*మరయఁగా క్షత్రియుల కెన్న నలరుచుండు*
*ప్రకృతిజన్య గుణంబులౌ పార్థ ! వినుము.*

**తాత్పర్యము :-** శౌర్యము, ప్రగల్భత్వము, అలయిక లేని ఓర్పు, నేర్పు, యుద్ధములలో వెనుకంజ వేయకుండుట, ఉదారముగా గుప్తదానముఁ జేయుట, ప్రభుశక్తి అను నివి క్షత్రియులకు స్వభావసిద్ధములైన కర్మలు.

**శ్లో. కృషిగోరక్ష *వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్ ।**
**పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥** 44

*తే.గీ. పరగ వ్యవసాయమున్ను వ్యాపారమున్ను*
*పశుల సంరక్ష వైశ్యుల ప్రకృతిగుణము*
*లిలను సేవకావృత్తి శూద్రులకు నైన*
*ప్రకృతి సంభవ గుణమునౌ పాండుపుత్ర !*

**తాత్పర్యము :-** వ్యవసాయము చేయుట, గోరక్షణ, వస్తువుల క్రయ విక్రయము వైశ్యులకు ప్రకృతిసిద్ధములైన కర్మలు. ప్రకృతినిబట్టి శుశ్రూష (సేవ) చేయుట శూద్రులకు వృత్తియై యొప్పుచున్నది.

---

* గౌరక్ష్య - పాఠాంతరములు

**శ్లో. స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః ।**
**స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥ 45**

*తే.గీ. వారి వారికి నియమింపఁ బడిన యట్టి*
*కర్మలను జేసి సిద్ధిని గాంతురు జనులు*
*తనదు కర్మల వర్తించు మనుజుఁ డెట్లు*
*సిద్ధిఁ బొందునొ వివరింతు చెలగ వినుము.*

**తాత్పర్యము :-** తనకు శాస్త్రముచే నియమింపఁబడిన ఆయా కర్మలను తత్పరతతోఁ జేసిన మనుజుఁడు జ్ఞానయోగ్యతను బొందును. స్వకర్మలను శ్రద్ధతోఁ జేయుటచే జ్ఞానయోగ్యత కలుగు విధమును తెలిపెదను-వినుము.

**విశేషార్థము :-** స్వకర్మానుష్ఠానముచే శరీరేంద్రియముల అశుద్ధి నశించును. దానివలన జ్ఞాననిష్ఠకుఁ దగిన సిద్ధి కలుగు నని భావము.

**శ్లో. యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 46**

*తే.గీ. భూతజాల మదెవనిచేఁ బుట్టి వరలు*
*ఎవనిచే నిండి యొప్పెడు నీ జగంబు*
*అట్టి యీశ్వరుఁ దన దైన యట్టి నిత్య*
*కర్మములఁ గొల్చి సిద్ధినిఁ గాంచఁ గలఁడు.*

**తాత్పర్యము :-** లోకములోని ప్రాణులన్నిటికి ఎవనివలన ఉత్పత్తి కలుగుచున్నదో, ఈ జగ మంతయు ఎవనిచే వ్యాపింపఁబడియున్నదో, అట్టి సర్వాంతర్యామిని మానవుఁడు తనకు నియమింపఁబడిన కర్మలచే ఆరాధించుట వలన చిత్తశుద్ధిని బొందఁగలడు.

**విశేషార్థము :-** కులధర్మోచితమైన కర్మ ననుసరించుటయే భగవంతుని ఆరాధించుట. వేఱు విధముగా వర్తించుట భగవ దారాధనము కాదు.

**శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।**
**స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ 47**

*తే.గీ. చక్కగా నాచరింపంగ సాగినట్టి*
*ఇతర ధర్మాలకంటెను నెంచి చూడ*
*గుణవిహీనమె యైనను గూడ, తనదు*
*ధర్మమే మేలు దోషాన దగుల బడడు.*

**తాత్పర్యము :-** తన వర్ణమునకు నియతమగు కర్మమును విడచి పర ధర్మమును లెస్సగా ఆచరించుటకంటె, దోషముతోఁ గూడినను స్వవర్ణమునకు నియతమగు ధర్మమును ఆచరించుటయే ప్రశంసింపఁదగినది. తన స్వభావమున కుచితమగు ధర్మము నాచరించెడివాఁడు పాపమున బడడు.

**శ్లో. సహజం కర్మ కౌన్తేయ ! సదోష మపి న త్యజేత్ ।**
**సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః ॥ 48**

*తే.గీ. సహజ మగు కర్మఁజూడ దోషంబుతోఁడ*
*గప్పఁ బడినను విడువంగఁ గాదు పార్థ !*
*నిప్పు నే రీతిగా పొగ గప్పియుండు*
*అవనిఁ గర్మల దోషంబు లటులె గప్పు.*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ప్రకృతిచే లభించిన కర్మములను అవి దోషముతోఁ గూడినవై నప్పటికిని విడువరాదు. పవిత్రముగనున్న అగ్నిని పొగ కప్పియుండునట్లు కర్మలను దోషములు కప్పియుండును.

**విశేషార్థము :-** స్వధర్మమైనను, పరధర్మమైనను ప్రకృతి గుణములైన సత్త్వ రజ స్తమో గుణములచే ఆవరింపఁబడినవే. కావున అవి దోషరహితములని సారాంశము.

**శ్లో. అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।**
**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥ 49**

*తే.గీ. సకల కర్మలయం దనాసక్తు డగుచు*
*ఆశ లెడలి మనోనిగ్రహముగలాడు*
*కర్మఫలముల నెల్ల త్యాగంబుఁ జేసి*
*పరమ నైష్కర్మ్య సిద్ధిని బడయఁ గలడు.*

**తాత్పర్యము :-** అన్ని విషయములందును ఆసక్తి లేని బుద్ధితో, అంతఃకరణమును పూర్తిగా స్వాధీనము చేసికొనినవాఁడై, ఆశలను విడచి పెట్టినవాఁడు సర్వ కర్మ సన్న్యాసరూపమగు ఆత్మజ్ఞానముచే నైష్కర్మ్య రూప మోక్షమును పొందును.

**శ్లో. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే ।**
**సమాసేనైవ కౌన్తేయ ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥ 50**

*తే.గీ. పొసగ నైష్కర్మ్య సిద్ధిని బొందువాఁడు*
*శ్రేష్ఠ మగు పరబ్రహ్మమున్ చెందుటకును*
*నెమ్మి నమువగు సుజ్ఞాన నిష్ఠ గూర్చి*
*తెలిపెదను నీకు వినుము కుంతీకుమార !*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! తనకు ఉచితమగు కర్మను ఆచరించుటచే చిత్తశుద్ధి గలుగునని వింటిని. అట్టి జ్ఞాననిష్ఠను బొందిన పిదప యే మార్గముచే పరబ్రహ్మను పొందఁదగునో, ఆ బ్రహ్మజ్ఞాన పరిసమాప్తి ఎట్టిదో తెలిపెదను వినుము.

**విశేషార్థము :-** చిత్తశుద్ధి సాధించినవాఁడు, సర్వ కర్మ సన్న్యాసముతో ఎట్టి జ్ఞాననిష్ఠ ననుసరింపవలెనో తెలుపఁబడుచున్నది.

**శ్లో. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ ।**
**శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ॥ 51**

**శ్లో. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥ 52**

**శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।**
**విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే ॥ 53**

*తే.గీ. నిర్మలంబగు బుద్ధి రాణించుచుండి*
*దృఢ మనో నిగ్రహం బొప్ప నడచువాఁడు*
*అలర శబ్దాది పంచేంద్రియాది విషయ*
*ప్రీతి విడిచి, రాగద్వేష వితతి వదలి,*

*కోరి యేకాంతమున్ మితాహార మొంది,*
*త్రికరణంబుల మేల్మి స్వాధీనపఱచి,*
*ధ్యాన యోగమునందు నత్యంతప్రీతి*
*ఇహసుఖాల వైరాగ్య మెంతొ గలిగి,*

*కామమును క్రోధమును నహంకారమున్ను*
*బలము దర్పము దానంబుఁ బట్టుటయును*
*పూర్తిగా వీడి, మమకారమును త్యజించి,*
*శాంతుఁ డగువాఁడు బ్రహ్మైక్యశక్తుఁ డగును.*

**తాత్పర్యము :-** నిర్మలమైన బుద్ధితో ధైర్యముతో ఆత్మను గ్రహించుకొని, శబ్ద రూపరసస్పర్శగంధము లనెడి విషయములను విడచి, ాగద్వేషములకు లోనుగాక యుండవలయును.

మనోవాక్కాయ కర్మలను కట్టిపెట్టి మితాహారముతో జనము తిరుగరాని దేశము నాశ్రయించి, వైరాగ్యభావమును పెంపొందించుకొని, ఎల్లప్పుడు ్యాననిష్ఠయందే లీనమై బ్రహ్మనిష్ఠాపరుడై యుండవలెను.

బ్రహ్మనిష్ఠయందున్నవాఁడు అహంకారమును, బలమును, గర్వమును, ామమును, క్రోధమును, ధర్మానుష్ఠానమున గలుగు బాహ్యమైన పరిగ్రహమును డువవలెను. 'నేను', 'నాది'యను భావమును మాని, పరమశాంతమును హించుచు ఎల్లప్పుడును ధ్యానము సలుపుచుండవలయును.

**శ్లో. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।**
**సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥ 54**

*తే.గీ. బ్రహ్మనిష్ఠుఁడు, నధ్యాత్మపరుఁడు, నిత్య*
*సుప్రసన్నాత్మకుఁడు నెప్డు శోక మొందఁ,*
*డెదియుఁ గోరఁడు, ప్రాణులం దెన్న సమతఁ*
*బూను, శ్రేష్ఠమౌ మద్భక్తిఁ బొందు విజయ !*

**తాత్పర్యము :-** బ్రహ్మనిష్ఠయందున్న పరమహంస పరివ్రాజకుఁడు ిర్మలమగు మనస్సుచే నొప్పుచుండును గాన ఏదానినిఁగూడ కోరడు; దేని ైనను గూడ విచారింపఁడు. అన్ని భూతములయందును సమభావమునే లిగియుండును. నాయందు ఉత్కృష్ట మగు భక్తిని పొందును.

**శ్లో. భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥ 55**

తే.గీ. వరలు భక్తిచేతన్ నే నెవండనో, మ
రెట్టి వాఁడనొ పూర్తిగా నెఱుఁగఁ గలఁడు
అట్లెఱింగిన మద్భక్తు డంత్య మందు
నన్నుఁ బొందు నాలోన లీనంబు నొందు.

**తాత్పర్యము :-** అటువంటి నిర్మలమైన భక్తిచే నేనెంతవాఁడనో, ఎట్టి వాఁడనో అద్దాని తత్త్వము నంతయు తెలిసికొనిన పిదప ఆ బ్రహ్మనిష్ఠుఁడు నాయందే ప్రవేశించుచున్నాఁడు.

**విశేషార్థము :-** ఇందు 'జ్ఞానము', 'ప్రవేశము' రెండును వేఱు కాదు. ఒక్కటియే. చిత్తశుద్ధిఁ గల పురుషుఁడు సర్వకర్మ సన్న్యాసముఁ గావించి, జ్ఞాననిష్ఠనాశ్రయించి పరమాత్మజ్ఞానమును పొంది బ్రహ్మభావమును (ముక్తిని) పొందును. ఇది ఉత్తమాధికారి లక్షణము.

**శ్లో. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।**
**మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥ 56**

తే.గీ. ఎల్ల వేళల నన్నాశ్రయించి, యెపుడు
సర్వకర్మలఁ జేయంగ సాగునట్టి
వాఁడు శాశ్వతమైన యవ్యయము నైన
మోక్షమును నా యనుగ్రహంబునను బొందు.

**తాత్పర్యము :-** నన్నే ఉత్కృష్టమైన ఆశ్రయముగాఁ దలంచి, ఎల్లప్పుడును అన్ని కర్మలును నాకే యర్పించి బుద్ధితోఁ జేయు మనుజుఁడు నా ప్రసాదముచే నాశరహితమగు శాశ్వతపదమును పొందును.

**విశేషార్థము :-** జ్ఞాననిష్ఠకు అర్హతలేనివాఁడు ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరించినచో క్రమముగా ముక్తి పొందునని 'మధ్యమాధికారి' విషయము తెలుపఁబడినది.

**శ్లో. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।**
**బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ ॥ 57**

*తే.గీ. సకల కర్మలు నాయందె సన్న్యసించి*
*గతిగ నన్నెంచి బుద్ధియోగమున సతము*
*మనసు నాయందె నిల్పి సంవత్సరముగ*
*నన్ను ధ్యానించు మెల్లప్పు డున్నతాత్మ !*

**తాత్పర్యము :-** అర్జునా ! కావున నీవు ఇఁక మీద వివేకముఁ గలవాఁడవై సకల కర్మలను నాయందు సన్న్యసించి, నన్నే పరమాశ్రయముగాఁ గలవాఁడవై, బుద్ధియోగము నాశ్రయించి నీ చిత్తమును ఎల్లప్పుడును నాయందే లగ్నము చేసినవాఁడ వగుము.

**శ్లో. మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।**
**అథ చేత్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ 58**

*తే.గీ. చిత్త మెప్పుడు నాయందె చేర్చితేని*
*సకల సంసార దుఃఖముల్ సమసిపోవు*
*కాని నామాట నీ వహంకారముునను*
*వినకపోయిన జెడిపోదు వనుట నిజము.*

**తాత్పర్యము :-** నీ చిత్తమును నాయందే యర్పణము చేసినట్లైన నా యనుగ్రహ విశేషముచే దాఁటుటకు శక్యముగాని సకల సంసార హేతువులను దాఁటఁగలవు. ఒకవేళ దురహంకారమువలన నీవు వినకుంటివా, వినాశము నొందుదువు.

**శ్లో. యద్యహంకార *మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।**
**మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥ 59**

*తే.గీ. తగ నహంకార బుద్ధి యుద్ధంబుఁ జేయ*
*నిష్టపడవేని నీ యత్న మెల్ల వృథయ,*
*నీ స్వభావము నీచేత నిశ్చయముగ*
*రణము చేయించి తీరు పార్థా ! నిజమ్ము.*

---

*యదహంకారం - పాఠాంతరము.

**తాత్పర్యము :-** ఏ కారణమువలననైనను సరే నీవు దురభిమానముచే నీవింతకు మున్ను పలికినట్లుగా 'యుద్ధముఁ జేయన'ని నిశ్చయించితి వేని అది వ్యర్థ మయిన నిశ్చయ మగును. ఏల యనిన ? క్షత్రియస్వభావము నీచే నెట్లయినను యుద్ధము చేయించి తీరును.

**శ్లో. స్వభావజేన కౌన్తేయ ! నిబద్ధ స్స్వేన కర్మణా ।**
**కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్ ॥ 60**

*తే.గీ. నీ స్వభావంబుచేతను నీకుఁ గల్గు*
*ప్రబలసంస్కార కర్మసంబద్ధుఁడ వయి*
*దేని నజ్ఞానమునఁ జేయఁబూన వనెదొ*
*అదియె సేతువు పరతంత్రతానుమతిని.*

**తాత్పర్యము :-** క్షత్రియ ప్రకృతి సిద్ధము శౌర్యరూపమగు యుద్ధము. నీకు విహితమగు నీ కర్మమును అవివేకముచే చేయుట కిష్టపడక పోయినను అవశుఁడవై నీకు తెలియకయే నీ కిష్టములేని యుద్ధమునే చేసెదవు సుమా !

**శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున ! తిష్ఠతి ।**
**భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥ 61**

*తే.గీ. సకలభూత నియామకశక్తియుతుఁడు*
*అయిన యీశుఁడు దేహము లనెడి యంత్ర*
*ముల నధిష్ఠించియున్న ప్రాణులను మాయ*
*చేతఁ ద్రిప్పుచు హృదయాలఁ జెలఁగుచుండు.*

**తాత్పర్యము :-** ఈశ్వరుఁడు అన్ని భూతములను నియమించువాఁడు. ఆయన వ్యక్తుఁడుగాక అన్ని దేహములయొక్క హృదయ ప్రదేశమున అధిష్ఠించియుండి యంత్రమును త్రిప్పిన విధముగ తన మహాశక్తిచేత ఈ ప్రాణులన్నిటిని త్రిప్పుచున్నాఁడు.

**శ్లో. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !**
**తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62**

తే.గీ. సకల విధముల నతనినే శరణు( గొనుము
తత్ప్రసాదంబువలన నుత్తమ విశిష్ట
పరమశాంతిని బడయుదు మరియు నీకు
శాశ్వతం బైన దివ్యమోక్షము లభించు.

**తాత్పర్యము :-** భరతవంశములో పవిత్రుడవగు ఓ అర్జునా ! నీవన్ని విధముల ఆ ఈశ్వరునే శరణు పొందుము. ఆ సర్వాంతర్యామి అనుగ్రహము వలననే ఉత్కృష్టమగు శాంతిని, శాశ్వతమగు స్థానమును పొందగలవు.

**శ్లో. ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా ।**
**విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥** **63**

తే.గీ. అరయ(గా నిట్లు పరమరహస్య మైన
జ్ఞాన మిది నీకు తెలుపంగ( జాలినాడ
తగ విమర్శించి నిశ్శేషముగను దీని
నాచరింపుము తోచిన యట్లు విజయ !

**తాత్పర్యము :-** అర్జునా ! రహస్యములలో కెల్ల రహస్యమైన యీ జ్ఞానశాస్త్రమును నీకు కూర్మితో నుపదేశించితిని. దీనిని నీవు పూర్ణముగా విమర్శించుకొని నీకు తోచినట్లు చేయుము.

**విశేషార్థము :-** యుద్ధము మానవలదని శ్రీ కృష్ణుడు అర్జునుని ప్రోత్సహించుటకు ఈ గీతోపదేశము చేసియు, ఏదియో యొక విధమున బలాత్కారము చేసిన ట్లగుపడకుండ నీవాలోచించి నీ యిష్టానుసారము చేయు మనుచున్నాడు.

**శ్లో. సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।**
**ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ ॥** **64**

తే.గీ. నాకు నీవెంతో యిష్టుడైనావు గాన
అతిరహస్యమై శ్రేష్ఠమైనట్టి నాదు
పరమ హిత వాక్యమును నేను మరల నీకు
ప్రేమతో( బల్కెదను శ్రద్ధ వినుము పార్థ !

**తాత్పర్యము :-** నాకు నీవు ప్రియమైన వాఁడవు. కావున నీ హితముఁగోరి గోప్యములలోకెల్ల గోప్యతమమగు విషయము నింకొక్క దానిని నీకు తెలిపెదను. నీ చిత్తమును శ్రద్ధగా చేర్చి వినుము.

**శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65**

*తే.గీ. చిత్త మెప్పుడు నాయందె చేర్చి భక్తి*
*నన్నె ధ్యానించుచును మేల్మి నన్నె మ్రొక్కు*
*మర్జునా ! నన్నె పొందంగ నౌను నీకు*
*ఇది యథార్థమ్ము సత్యమౌ నిష్టసఖుఁడ !*

**తాత్పర్యము :-** నీవు నా భక్తుఁడవు. నేను ప్రతిజ్ఞచేసి యథార్థమును పలుకుచున్నాను. నీవు నాయందే మనసు నిలుపుము. నా భక్తుఁడవు కమ్ము. నన్నే పూజింపుము. నాకే నమస్కరింపుము. నీవు నన్నే పొందఁగలవు.

**విశేషార్థము :-** పరమేశ్వరుఁడ నగు నన్నే శరణుపొంది కర్మము నాచరింపుము. దానివలన పురుషార్థము లభించును.

**శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ 66**

*తే.గీ. సర్వ ధర్మంబులను వీడి సవ్యసాచి !*
*నన్నె శరణంబుఁ గోరుము నిన్ను నేను*
*సర్వ పాపంబులం దుండి సత్వరముగ*
*ముక్తు జేసెద దుఃఖింపఁ బోకు విజయ !*

**తాత్పర్యము :-** అన్ని ధర్మములను వదలిపెట్టి పరమాత్మ స్వరూపుఁడనగు నన్నే శరణు పొందుము. నేను నిన్ను సర్వపాప కర్మములనుండి విడిపించి మోక్షము నిచ్చెదను. నీవు ఎంత మాత్రమును విచారింపవలదు.

**విశేషార్థము :-** సర్వ కర్మ సన్న్యాసముఁ జేసి, జ్ఞాన నిష్ఠనాశ్రయించినచో అన్ని దుఃఖములు పోయి బ్రహ్మభావము కలుగునని సారాంశము:

**శ్లో. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।**
**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి ॥ 67**

తే.గీ. భక్తి శ్రద్ధలు లేనట్టివారలకును
గురుల శుశ్రూష సలుపని క్రూళలకును
తపము విడి నన్ను నిందించు కృపణులకును
చెప్పఁదగదిద్ది నీకె నే జెప్పితి నిది.

**తాత్పర్యము :-** ఈ గీతాశాస్త్రమును నేను నీకు చెప్పితిని. నీవు దీనిని తపస్సు చేయనివారికిఁగాని, శుశ్రూష చేయనివారికిఁగాని, నన్ను అసూయతో జూచువారికిఁగాని చెప్పరాదు.

**విశేషార్థము :-** ఇందు శాస్త్రోపదేశ సంప్రదాయము; ఉపదేశార్హత - సూచింపఁబడినవి.

**శ్లో. య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః ॥ 68**

తే.గీ. అరయ పరమ రహస్యమైనట్టి దీని
అవని నా భక్తులకుఁ జెప్పునట్టివాఁడు
పరమ సద్భక్తి నాయందు స్థిరపడంగ
సందియము లేక తుదిని నన్ పొందఁ గలఁడు.

**తాత్పర్యము :-** పరమగోప్యమగు నీ శాస్త్రమును నా భక్తులకుఁ దెలుపుచు గ్రంథరూపమునఁగాని, అర్థరూపమునఁగాని ప్రవర్తింపఁజేయునతఁడు ఉత్కృష్టమైన నా సేవచే నాయొక్క భావమునే పొందఁగలఁడు. ఇందులో ఎట్టి సంశయమును లేదు.

**శ్లో. న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి ॥ 69**

తే.గీ. మనుజులందున నా భక్తజనులకొఱకు
చెలిమి నీ భగవద్గీతఁ జెప్పునట్టి
వానికంటెను ప్రియుమైనవాఁడు నాకు
ముందులేఁ డెన్న మఱియు నిప్పుఁడును లేఁడు.

**తాత్పర్యము :-** ఈ గీతాశాస్త్రమును నా భక్తులకు ప్రవర్తింపజేయు ఆచార్యోత్తములకంటె నాకు ప్రియతరమైనవారు ఈ మనుష్యలోకములో ఇప్పుడు లేరు: ఇక ముందును రాబోరు.

**శ్లో. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।**
**జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్ట స్స్యా మితి మే మతిః ॥ 70**

*తే.గీ. అరయ ధర్మంబునకు మూలమైన యట్టి*
*ఈ మన విశిష్ట సంవాద మెవఁడు భక్తి*
*వరలఁగ బఠించునో యట్టివాఁడు నాకు*
*జ్ఞాన యజ్ఞంబుతో పూజ సలిపినట్లు.*

**తాత్పర్యము :-** అర్జునా ! ఈ గీతాశాస్త్రము మన ఇరువురకును ధర్మమార్గము నతిక్రమించకుండ జరిగిన సంవాదము. దీనిని పఠించిన భక్తుఁడు జ్ఞానయజ్ఞరూప మగు గీతాధ్యయనముచే నన్ను గొల్చెనని భావింతును.

**శ్లో. శ్రద్ధావా ననసూయశ్చ శ్రుణుయా దపి యో నరః ।**
**సోఽపి ముక్త శ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్ ॥ 71**

*తే.గీ. చదువలేకుండినను భక్తి శ్రద్ధ లొలుక*
*ప్రీతి నీ భగవద్గీత వినెడు నట్టి*
*వాఁడు నిల బంధముక్తుఁడై పరమపుణ్య*
*పురుషు లొందెడు శుభలోకముల సుఖించు.*

**తాత్పర్యము :-** సామాన్యమానవుఁడైనను సరే అసూయాపరుఁడుగాక, భక్తిశ్రద్ధలతో వినువాఁడు సర్వపాపములనుండి విముక్తి నొందినవాఁడై పుణ్యపురుషులు పొందు లోకముల నన్నిటిని పొందఁగలఁడు.

**విశేషార్థము :-** గీతాశాస్త్రమును నేర్పు ఆచార్యోత్తములకును, అధ్యయనము చేయువారికిని, వినువారికిని గూడ మహాఫలము గలుగునని సారాంశము.

**శ్లో. కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ ! త్వయైకాగ్రేణ చేతసా ।**
**కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రనష్ట స్తే ధనంజయ ! 72**

*తే.గీ. శ్వేతవాహన ! నాచేతఁ జెప్పఁబడిన*
*దీని నంతయు నేకాగ్రమైన యట్టి*
*బుద్ధి వింటివా ? యజ్ఞానమునఁ గలిగిన*
*మోహ మంతయుఁ దొలఁగెనా పూర్తిగాను ?*
*అనిన భగవానుఁ గని పార్థుఁ డనియె నిట్లు.*

**తాత్పర్యము :-** ఓ అర్జునా ! ఈ గీతాశాస్త్రమును నీవు ఏకాగ్ర చిత్తముతో వింటివా ? అజ్ఞానముచే పుట్టిన నీ మోహాము ఇపుడు నీ మనసునుండి తొలఁగిపోయినదా ? లేదా ?

**విశేషార్థము :-** శ్రద్ధాభక్తులతో ఒకసారి విన్నను మనుజులకు అజ్ఞానము వలనఁ గలిగెడు వ్యామోహము తొలఁగిపోవును. అట్టిది అర్జునునకుఁ గలిగెనా? లేదా? తెలిసికొనఁగోరి పరమాత్మ ప్రశ్నించుచున్నాఁడు.

*అర్జున ఉవాచ :-*

**శ్లో. నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత !**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥** 73

*తే.గీ. అచ్యుతా ! త్వదీయానుగ్రహంబువలన*
*మోహము నశించి జ్ఞానంబుఁ బొందనైతి*
*తీరె సందేహములు నెల్ల స్థిరుఁడనైతి*
*నీదు నాజ్ఞను బాలింతు నిశ్చయముగ.*

**తాత్పర్యము :-** కృష్ణా ! నా మోహమంతయు నశించిపోయెను. నీ దయవలన నాకుఁ దెలివి గలిగెను. నేనిప్పుఁ డన్ని సందేహములు తీఱినవాఁడనై యున్నాను. అచ్యుతా ! నీవు బోధించిన ప్రకార మిపుడు చేయఁగలను.

*సంజయ ఉవాచ :-*

**శ్లో. ఇత్యహం వాసుదేవస్య పార్థ స్య చ మహాత్మనః ।**
**సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥** 74

తే.గీ. అనుచు నత్యద్భుతముగ మహాత్ముఁడైన
వాసుదేవునకును మఱి పార్థునకును
గలిగినట్టి యీ సంవాదములను నాదు
మేను పులకింపఁ గురురాజ ! నేను వింటి
ననుచు మఱియును సంజయుఁ డనియె నిట్లు.

**తాత్పర్యము :-** సంజయుఁడు - ధృతరాష్ట్రునితో; అయ్యా ! మహాత్ములైన శ్రీ కృష్ణార్జునసంవాదరూపమైన ఈ గోష్ఠిని మనస్సునకు ఆనందము కలుగఁగా, శరీరము పులకలు జనింప వీనులార వింటిని.

**శ్లో. వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్యాతమం పరమ్ ।**
**యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయత స్స్వయమ్ ॥75**

తే.గీ. పరమశ్రేష్ఠమై గోప్యమై వరలు నట్టి
ఈ విశిష్ట యోగమును యోగీశ్వరుఁడగు
వాసుదేవుండు స్వయముగా ఫల్గుననకుఁ
జెప్పుచుండ స్వయముగా విశిష్టతేజ !
వ్యాసభగవాను సత్కృపవలన వింటి.

**తాత్పర్యము :-** రాజా ! ఉత్తమమును, గోప్యమున్నైన యీ గీతా శాస్త్రమును యోగేశ్వరుడైన కృష్ణుఁడే చెప్పుచుండఁగా వేదవ్యాసుని కృపచే నేను వీనులార వినఁ గల్గితిని.

**శ్లో. రాజన్ ! సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్ ।**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహు ర్ముహుః ॥ 76**

తే.గీ. అతి పవిత్రమై యద్భుతం బౌచు నలరు
అచ్యుతార్జున సంవాదమైన దీని
మరల మరలఁ దలంచుచుం బరమ ముదముఁ
బొందుచున్నాఁడ ధృతరాష్ట్ర భూవరేంద్ర !

**తాత్పర్యము :-** ఓ ధృతరాష్ట్ర మహారాజా ! శ్రీ కృష్ణార్జున సంవాదరూపమైన, పవిత్రమైన, అద్భుతమైన ఈ శాస్త్రమును మాటి మాటికి తలచుకొనుచు, మఱల మఱల సంతోషించుచున్నాను.

**శ్లో. తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః ।**
**విస్మయో మే మహాన్ రాజన్ ! హృష్యామి చ పునః పునః ॥ 77**

*తే.గీ. దివ్యమును నద్భుతం బౌచు దేజరిల్లు*
*వినుత మైనట్టి శ్రీహరి విశ్వరూప*
*దర్శనము మాటి మాటికి దలచి*
*పొందుచున్నాను విస్మయంబును ముదమ్ము.*

**తాత్పర్యము :-** రాజా ! అద్భుతమైన ఆ శ్రీకృష్ణ భగవానుని విశ్వరూప సందర్శనమును తలచుకొను కొలది నాకు అమితమైన ఆశ్చర్యము గలుగు చున్నది. నేను ఆనందముతో ఉప్పొంగుచున్నాను.

**శ్లో. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।**
**తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥ 78**

*తే.గీ. ఎలమి యోగేశ్వరుఁడు కృష్ణు డెచటనుండు*
*విల్లుదాలిచి యెచ్చట విజయుఁడుండు*
*అచట శ్రీవిజయవిభూతు లలరుచుండు*
*దృఢతరమ్మైన నీతియు దేజరిల్లు*
*నని దలంతును నేను రాజాధిరాజ !*

**తాత్పర్యము :-** యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడును, గాండీవమును దాల్చిన అర్జునుడును ఏ పక్షమున నుందురో ఆ పక్షమున (పాండవపక్షమున) లక్ష్మియు, నీతియు, ఐశ్వర్యమును, విజయమును నిశ్చయముగ నుండునని నా మనస్సు నాకు తెలుపుచున్నది.

**విశేషార్థము :-** కృష్ణార్జును లిఱువురు నుండినచోట సకల ధర్మము లుండునని సంజయుఁడు పలికెను. గీతాశాస్త్రము నుపదేశించిన శ్రీ కృష్ణుని యొక్కయు, శ్రోతయగు అర్జునునియొక్కయు అద్భుతశక్తుల నాతఁడు కొనియాడెను.

ఇతి సర్వం శ్రీ కృష్ణార్పణమస్తు

హరిః ఓమ్ ఓమ్ తత్సత్ ఓం

ఇది ఉపనిషత్ప్రతిపాదకంబును బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రంబును శ్రీ కృష్ణార్జున సంవాదంబును నగు
శ్రీ మద్భగవద్గీతలందు
మోక్ష సన్న్యాస యోగంబను
పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

'ఓం తత్ సత్'

# అకారాద్యను క్రమణిక

## న

పా

### శ

# శ్లోకాది సూచిక

అంకెలలో మొదటిది అధ్యాయసంఖ్యను, తరువాతిది శ్లోకసంఖ్యను తెలుపును.

## అ

పేజి నెం.

## ఆ



## ఇ

## ద

## య

## ర



## ల

పేజి నెం.

## వ



## శ

## స

## హ



